# ఇచ్ఛినీకుమారి.



గ్రంథకర్త:

## కొల్లూరు లక్ష్మినరసింహ కవి

మొదటికూర్పు 1000 ప్రతులు.

బెజవాడ

శారదా భాండార ముద్రాశాలలో

ముద్రితము.

 [వెల రు. ౦-౧౨-౦.

# పీఠిక

ఆర్యులారా?

చిరకాలమునుండియు కవనమునందభిలాష గలవాడ నయ్యును, పిన్నవయస్కుండ నగుటచేతను, నానివాసమొకపల్లెటూరవుటచేతను, నాకంతగ ప్రోత్సాహము చేయువారు లేకపోయిరి. హూణభాషాప్రవేశ మున్నప్పటికి, యేలకో దానియందు, నాకంతయభిరుచిలేకపోవుటచే, దానినంతవర కాపవలసినవాఁడనైతిని. దైవవశమున, సంస్కృతాంధ్ర శతావధానులగు, బ్రహ్మశ్రీ, శ్రీగిరి చెన్నబసవయ్యశాస్త్రి గారి ప్రోత్సాహముమీఁద, దేశచారిత్రిననుసరించి, నేదేని యొకరూపకమగు గ్రంథము వ్రాయసమకట్టితిని. ఇదియే నాప్రథమ ప్రయత్నమగుటచే, గ్రంథరచనకుఁ గొంతకాలము పట్టెను.

ఈకథ మ్లేచ్ఛులదాడినడ్డగించి భరతఖండముయొక్క స్వాతంత్ర్యమును గాపాడిన రాజశిఖామణులలో నొక్కఁడగు పృథ్వీరాజుచరిత్రమగుటచే, పలువురకు మనోరంజకముగానుండునని యెంచి వ్రాయమొదలిడితిని. పైనినుదహరించినట్లు నిదియె నాప్రథమపుష్పమగుటచే, తప్పులు మెండుగా నుండవచ్చు గుణగ్రహణపారీణులగు వారు ఒప్పుల నేగ్రహించి తప్పులు నాకుదయతోఁజూపిన యెడల వందనములతోఁ గ్రహించి దిద్దుకొనుటకు సిద్ధముగానున్నాను.

ఇట్లు

బుధజనవిధేయుడు,

కొల్లూరు లక్ష్మీనరసింహాకవి.

29-11-24
జుఝునరం.

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు.

## పురుషులు

భీమరాజు—కథానాయకుఁడు. (ఘూర్జర దేశపురాజు)
అమరసింహుఁడు—భీమరాజు మంత్రి.
మధుమంతుఁడు—స్నేహితుఁడు.
జైతపరమారుఁడు { కథానాయకురాలి తండ్రి. (అబూపర్వతాధీశ్వరుఁడు)
ఈశ్వరభట్టు—ఇచ్ఛినీగురువు.
అభయసింహుఁడు—జైతుని మేనల్లుఁడు.
అర్చకుఁడు—అబూపర్వతపు దేవాలయ అర్చకుఁడు.
పాలికాపులు—
సామంతరాజులు—
మహారాజవానులు—
పృథ్వీరాజు—ఢిల్లీచక్రవర్తి
కరుణరాజు—చక్రవర్తి పినతండ్రి
పత్రాపాదులు
గోకులదాస్ } 7గురు భీమరాజుని తమ్ములు.
కోసలాధిపుఁడు—(ఘూర్జరదేశపు సామంతరాజు.)
యుద్ధభటులు—

## స్త్రీలు

ఇచ్ఛినీకుమారి—కథానాయకురాలు. (జైతునికూఁతురు.)
రూపవతి
వకుళ } భీమరాజు దాసీలు.
దాసి—ఇచ్ఛినీకుమారి యంతఃపురపుదాసి.

# నాంది

శా॥ ఫాలాక్షుండు సదాప్రిజాళిమనః పద్మంబుల జూచుచున్
లీలార్థంబు సమస్తమానిగణము ల్నిత్యంబు పూజింపగా
కైలాసాద్రిపయిం, క్షెమంబరయుచుం గష్టంబులన్ దీర్చుచున్
కాశీనాథుడు సంపదలిచ్చిమిముల్ గారుణ్యముం బ్రోచుతన్॥
[illegible]

(నాంద్యంతమున సూత్రధారుండు ప్రవేశించిబువ్వులుచల్లును)

నాటకసందర్శనమునకై సభ్యులువిచ్చేసి చాలతడవయ్యె. ప్రస్తుత ప్రయోగమగు నాటకమునుగూర్చి యోజించుతరి, నన్నుపిలువుండని, నటియింకనురాలేదయ్యె? కారణమేమైయుండును. (నేపథ్యముంజూచి) ఏవియో గ్రంథరాజముల వెదకుచున్నది. ఇయ్యది వెదకుసమయముకాదు. పిలచెదగాక. (బిలచి) నటీ; ఒక్కమారిచ్చటకు వచ్చునంతయవకాశము కలదా?

నటి—(పుస్తకములతో బ్రవేశించి) ఇదిగో వచ్చితి. నేనను కొనిన గ్రంథరాజముదొరకనందున తడవాయెను,

సూత్ర—చేతినిండ పాత్రములు పెట్టుకొని, గ్రంథముల వెదవు. ఉన్నగ్రంథములతో గాలక్షేపణ చేయవచ్చును. అంత గాకొరతవచ్చిన చూచుకొనెదము,

నటి—నాకునిష్టము లేదు.

సూత్ర—(తనలో) ఈమెకుంగావలసినగ్రంథము బల్లమీద యుండగా సంగ్రహించితి. అయినను యీమెయుద్దేశ మెటులుండునో చూచెద. (ప్రకా) ప్రియా? నీకీవిచార మేల; ఆగ్రంథముపేరుగాని, కవిపేరుగాని చెప్పిన, దాని నేనెక్కడనైనచూచినచో దెల్పెద.

నటి—ఆగ్రంథమును తమరె సంగ్రహించిరని నేనూహించి తిని.

సూత్ర—వచ్చినదొంగతనము రానేవచ్చినది. ఆపుస్తకము పేరేమి?

నటి—ఆపుస్తకము పేరా?

తే॥ పల్కుమాధుర్యమహిమంబు పండితార్య
వందితంబునలంకార సుందరంబు
ఇచ్చినీకుమారి విచిత్రవింతనాట
కంబు శృంగారరసభరితంబుగాదె॥

సూత్ర—అట్లయిననాకుందెలియదు. నేజూచినది పృథ్వీరాజు పరిణయము.

నటి—పృథ్వీరాజుపరిణయ కొంచములోనిది.

సూత్ర—పంచమాంకములో యుద్ధానంతరము యుండ వలయును.

నటి—ఎవ్వరు రచియించిరి.

సూత్రి—ఇచ్ఛనీకుమారి, ఎవ్వరురచియించిరో చెప్పెము.

సీ॥ శ్రీగౌరివాసమ్మై వెలగుజుఝువరపు
రంబువాసస్థాన మింపుగుల్క
వెరపనులేనట్టి వేంకటశివయనా
మాత్యపుంగవునకుఁ బౌత్రికుండును
సతతంబు సర్వేశుఁ సన్నుతించెడిరత్త
మాంబకారత్తయ మాత్యసుతుఁడు
పరబ్రహ్మచారనఁ బరగుడగ్రజుండు
వెంకటశివయాఖ్యుఁ డెలమితమ్ముఁ

తే॥ డలరి? కొల్లాకువంశాబ్ధి జెలగువాఁడు
జనులునుతింపంగ నెగడు జగమునందు
శివదయాలబ్ధనాందాద్రి కవనయుతుఁడు
విమలవరాసుపర్ణసగోత్రి విమలుఁడనగ॥

సూత్ర—ఇఁక జెప్పనవసరములేదు. నేనెరుగనివాఁడనియా?

తే॥ పుడమిం పూరాణాదిభాషల నిండజదివి
నంతబొత్తములవ్రాయగ మొదలిడెగద,
క్రొత్తవానివలెన్ జెప్ప గోరితోకో?
లక్ష్మినృసింహాఖ్యుండైనె లసెనుగాదె॥

నటి— నేనెరుగనంటివే?

సూత్ర—నీవంటివి. నేనంటివి. ఇద్దరము నొక్క దారినే యుంటిమి.

నటి—నాగ్రంథమునిచ్చెదవా?

సూత్ర—(పుస్తకమును యిచ్చును.) సరియా?

నటి—(పోబోవును)

సూత్ర—(కరముపట్టుకొని) ప్రియా? యొక్కమాట?

నటి—ఇక్కడ కేచాల కాలహరణమైనది. ఇచ్చినపాత్ర ధరింపవలయును. (నిష్క్రమించును)

సూత్ర—అవునవును. కాలహరణమే యయ్యెను.

(నిష్క్రమించును.)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు.

# ఇచ్ఛినీకుమారి.

## ప్రథమాంకము.

### 1వ రంగము.

(అన్హిలపురంబేలు భీమదేవుఁడు స్నేహితుఁడు వేటకుజనుట.)

భీమదేవుడు—మిత్రమా? ఈరాత్రి గడచిపోయినది. నేడు నాకోర్కె సిద్ధించునట్లు లేదు.

స్నేహి—రాజా? అట్లందురేల? పెక్కుమృగంబులంజంపితిమే. ఇంతకంటె మనకేమి కావలయును.

భీము—మిత్రమా కావలసిన యడవిపంది దొరకలేదు.

స్నేహి—లేళ్ళకంటె బందుల్లకుఁగల మహాత్మ్యమేమి?

భీము—ఈవేటకు రాకారణమేమన, ఈదినములలోఁ బందిని వేటాడి భవానిదేవికి యర్పించుట, రాజపుత్ర యాచారమైయున్నది. ఏ రాజపుత్రుఁడు భవానిదేవికిఁ బందిని యర్పించునో వానికి యాసంవత్సరము పొడవునను తప్పక జయముగలుగును. అందులకే నీయరణ్యమున నింత ప్రయాసపడుచుంటిని. అదుగో మిత్రమా?

ఉ॥ కాలునివాహనంబు వలె కారడవిం జరియించు యీమృగం
బేల? వికాలసాహసము పేర్కొని భీకరవృత్తిఁ బూని యీ
వాలము ద్రిప్పుకొంచు మద వారణమో యన వచ్చుచుండె దా
నేలక్షమింపవచ్చు, నిఁక నేఁడు వధించెదఁ జూడు శౌర్యమున్॥

(అని బాణమును సంధించి, నిరుత్తరుఁడై.)

ఇప్పటికిఁగదా? నేను సఫలీకృతార్థుఁడనైతిని. ఇఁక భవానిదేవి యనుగ్రహంబునకుఁ బాత్రుండగావలయు. (పందిని సమీపించి) ఏమీ? రెండవ బాణమెవ్వరిది. (బాణముతీయలేక) ఆబాణమింకను దానిని నాటుకొనియేయుండెను. ఏమహానుభావుండు, యేశూరాగ్రగణ్యుండు, యేవీరాధిపురుండు యీబాణమును సంధించెనోగదా? నేనీబాణమును తీయలేకబోతిని—

సీ॥ తుహినాద్రి కాంతార మహియందు యడవిలో
విఖ్యాతిఁజెందిన వీరుఁడెవఁడు?
విలువిద్యయందున వీరుఁడై జెన్నొంది
ప్రఖ్యాతిఁజెందిన ప్రభుఁడెవండు?
యీదండకాటవి నేవీరుఁడేతెంచె
ధన్యతఁజెందెనే ధన్యుఁడెవఁడొ?
బాహుళ్యభుజబల భద్రుఁడై కాంతార
మహిఁగీర్తిఁగాంచిన మాన్యుఁడెవఁడొ?
గీ॥ ఏమహాత్ముఁడుగాకున్న యిట్టిబాణ
మిట్లుసంధించె? నేను, యీ మ్లేచ్ఛవర్యు
ద్రుంచినట్టి వీరుఁడనై కించితుశర
మూడఁదీయంగలేకుంటి నుర్వియందు॥

(మహారోషముతో) ఈపర్యాయము నేనీశరమును తీయలేక పోతినేని క్షత్రియుండనుగాను. (శరము లాగును.) హా! ధన్యుండ, ధన్యుండ, యిప్పటికింగదా? మహావిశ్వప్రయత్నముమీద నూడంబెఱికితిని. దీనిని జలంబులంగడిగి చూచెదగాక! (కడిగి దానివంకజూచి) మిత్రమా! యీశరము యిచ్ఛనీకుమారిది. ఆమెయెంత ధన్యురాలు. ఆమె రూపలావణ్యాదులచే యిదివరకు నన్ను జయించినది. నేడు ధనుర్విద్యా పాండిత్యముచే, నన్ను వశపఱచుకొనినది. శరీరమంతయు నామెయందు లయమగుచున్నది. (శరము వంకజూచి) ఇచ్ఛనీకుమారి? ఇచ్ఛనీకుమారి? నీయందమేమని వర్ణింతు. నీవుయిప్పుడు నన్ను చేపట్టి ఘూర్జరరాజ్యలక్ష్మిం జూఱవోంగదా?

స్నేహి—(తనలో) ఓహో! వీనికి మదనోన్మత్తవికారచేష్టలెక్కుడగుచున్నవి. (ప్రకాశముగ) మిత్రమా! వేళయయినది. త్వరగాంబోవుదము.

భీము—అట్లే పోవుదము. (నిష్క్రమింతురు.)

అవనిక పడును.

---

## 2వ రంగము.

(రూపవతి చిత్రపటములతో ప్రవేశించును)

రూప—చిత్రపటములు. చిత్రపటములోయి!

(అని కేక వేయును.)

(ప్రజలు గుమిగూడుదురు)

రూప—అంగ వంగ కళింగ కాశ్మీర నేపాల, బర్బర, విదేహ కాశి, ఘూర్జ రాంధ్ర కర్ణాట, చోళ, నేపాలా ధీశుల ఫోటోలు. (అని చూపించును.)

1వ—ఓలబ్బో? యిదేంగాని యీాయన నగిసీలేసినాడు.

2వ—అదేందిరా? ఈమహారాజు చాలాధర్మాత్ము డంటారు. ఆమొకమే తెలుత్తాల.

3వ—ఓలబ్బో? యీాయన యముండేంటసా్న. బొట్టమీా సాలు. మిరిగున్లు, చేతిలోదియేందిరా లావుగావుంది.

4వ—మనపాండవోరిని తెలుసునా? అందులో భీమయ్య గార్ని తెల్సునా? ఆయంగారి యీాయుధం గద. దెబ్బ కుమైసలా?

(దాసిప్రవేశము.)

దాసి—ఏమీా? యెవ్వరాజ్ఞమీాద చూపించు చున్నది. తొలగండి,

రూప—అమ్మా? నేనొక చిత్రకారిని.

దాసి—నిన్నిపుడు మారాణీగారు తీసుకొనిరమ్మన్నారు. రమ్ము. (యిద్దరునిష్క్రమింతురు)

పల్లెజలు—ఓలబ్బో? యిదేంమండరా? చూపించకుండ తీసుకుపోతాది. యీాతడవరానియి. పసచూాత్తా.

(నిష్క్రమించెదరు.)

(ఇచ్ఛిసీకుమారి. దాసి, రూపవతి ప్రవేశము.)

ఇచ్ఛి—ప్రస్తుతము భూపాలనచేయుచున్న రాజకుమారుల పటములు లేవా?

రూప — లేకేమి? (పటముయిచ్చును.)

ఇచ్ఛి — యువతీ! ఈపటమువ్వారిది.

రూప — అమ్మా?

మ॥ అరియాలోకన భీకరుండు బలమున్నత్యంబు దెల్పంబు సా
పరికింపన్ భువి లేఁడు అట్టి పురుషశ్రేష్ఠుఁడు హర్మ్యములం
సరియాతండు మహాత్ముఁడౌనని యునర్-సంతోష భీముండనన్
పరివారంబును ఘూర్జరీ ప్రజలతో-పాలించు వామామణీ॥

ఇచ్ఛి — (మందహాసముతో) భీమదేవుఁడితఁడా? ఇతనిరూప
మునకుఁ బేరునకుఁ దగియున్నది. కాని యువతీ
ఇతనిని ఇంతగాఁ బొగడుచున్నావు. ఇట్లుపొగడుమని
యీ రాజేంద్రుఁడే మైన నిచ్చెనా?

రూప — అమ్మా? ఇచ్చెడిదేమి? మహామహులందఱు బొగడ
తగినవారే కదా?

ఇచ్ఛి — సరి. ఇంకొక్క పటము చూపించుము.

రూప — దేవీ?

(ఒక్కొక్క పటముచూపును)

సీ॥ యుద్ధభూమినిఁ జొచ్చి తద్దయు బరిమార్చె
ధీరుండు బంగాళ-ధీశుఁడితఁడు
దానకంకణగట్టి ధర్మదూర్వహుఁడైన
ధీరుండు బర్బరా-ధీశుఁడితఁడు
సకల వైభవముతో-సౌందర్య విభవుండు
యీశుడు మాళవాధీశుడితడు.
కువలయంబెల్లను కూర్మితో నేలిన
యింద్రుఁడోయన కట-కేంద్రుఁడితఁడు

తే॥గీ॥ భామ! యిదెచూడుము, గాంభీర్య-బలుఁడనంగ
ధైర్యవిస్ఫూర్తి గలిగిన-ధన్యుఁడనఁగ
జెంకణాధిశుఁ జూడుమా-యింక నీవు
లేమ! పద్మాస్య, నతనాభి-లేడినయన!॥

ఇచ్ఛి—యువతీ! పృథ్వీరాజు చిత్రపటమున్నదా!

రూప—ఉండెడివి కానియవిఅన్నియు నమ్మబడినవి.

ఇచ్ఛి—వానిగూర్చి నీకేమయినా తెలియునా?

రూప—తెలియకేమి? కొంతకాలముకిందటనే, భీమదేవునకు సోమేశ్వరునకు ఘోరయుద్ధము సంభవించెను. అందు సోమేశ్వరుని భీమదేవుఁడు జయించి విఖ్యా—

ఇచ్ఛి—యువతీ! ఆసంగతియెందులకు? దానివలనభీమదేవుని సర్వాధికుఁడవని స్థాపింపఁబూనుచున్నావు. అందు వలన భీముని యందుఁగల పక్షపాతము వెల్లడియగు చున్నది. ఇంతమాత్రమున యతనికివచ్చిన మహాత్త్వమేమి? తదితరులకువచ్చిన నీచత్వమేమి? పృథ్వీరాజు సంగతి తెలియునా?

రూప—అమ్మా? క్షమింపుము. పృథ్వీరాజుగూడ గొప్పవాఁడని యేవింటి—

ఇచ్ఛి—అటులా? ఇంకనునీపక్షపాతబుద్ధి వదలలేదు? పోనీ, పృథ్వీరాజు పటమువ్రాయగలవా?

రూప—అమ్మా? మీయట్లనుట ధర్మమా? మీయొక్కయను గ్రహమును సంపాదించుకోవలయునని వచ్చితిని. సెలవైనచో వ్రాసెదను.

ప్రథమాంకము.

ఇచ్ఛి—అట్లే వ్రాయుము తగిన బహుమతి నిచ్చెదను.

రూప—(పటము వ్రాసి యిచ్చును.)

ఇచ్ఛి—భీమదేవుని చిత్రపటమునందుఁ జూపిన లేఖవాచా
తుర్యము, దీనియందు జూపింపలేదని నానమ్మకము.
నీవు వ్రాయగలిగియుఁ బాడుజేసితివి.

రూప—మీరట్లనుట ధర్మమా? పృథ్వీరాజు నాకారము
బాగుగాఁ దెలియక బోవుటచే నట్లు వ్రాసితిని.

ఇచ్ఛి—వానియాకారముఁ జెప్పిన వ్రాసెదవా?

రూప—ఆ...వ్రాయ కేమి?

ఇచ్ఛి—అట్లయిన వినుము—

సీ॥ నూనూఁగుమీసాల నూత్నయౌవనుఁడై యా
యెగుభుజంబులవాఁడు యిందువదన
సంకల్పసంభవ స్థానపీఠమొయన
నొప్పునే సౌందర్య యురమువాఁడు
వికసితోత్పలపత్ర విఖ్యాతనేత్రుఁడు
యంధ్రమాబింబమో ష్ఠంబువాఁడు
విద్రుమలతలతో విపులమైయేవేళ
తమ్ములైరొయొప్పు పాదములవాఁడు

తే॥గీ॥ ఘనత, నాజానబాహువు గంబుకంఠ
మలరి, కాంచనంబన మేను దళితముత్య
సరుళనందంబు దంతముల్ సాలుగనగ
యిప్డునెన్నంగ శక్యంబె యిగురుబోఁడి!

రూప—ఆ...వ్రాసెదను. (పటము వ్రాసియిచ్చును.)

## ఇచ్ఛనీకుమారి.

ఇచ్ఛ—యువతీ? నీ నేర్పు కడువింతగానున్నది. నీ శిక్షనాం చాతుర్యము నేర్చుకొనవలయుననియున్నది. నేర్పుదువా?

రూప—అమ్మా? అందులకభ్యంతరమేమి?

ఇచ్ఛ—సరే? ఇందులకు నాజనకుని యనుమతిం బడయవలయును. ఇంకొక్కతూరి శేనిపించుము.

(నిష్క్రమించెదరు.)

(అవనిక పడును,)

---

### 3వ రంగము.

సమయము—సాయంత్రము.

(భీమదేవుండుద్యానవనమందు కూర్చుండును)

భీముండు—(బాణమునుజూచి) హా? ఇచ్ఛనీ? నీయాయుధ చాతుర్యమెంతని వర్ణింతును. నీగుణములెంతని వర్ణింతును. విలువిద్యయందు, రెండవ సత్యభామవని చెప్పవచ్చును. ఏవీరాగ్రేసరుని వరించెదవో గదా? ఏధన్యాత్ముండు నీయధరామృతంబుం గ్రోలునో గదా? ఏవీరునిం జేపట్టుదువో గదా? ఆహా? నీసోయగంబేమని వర్ణింతు. (అటుచూచి) అమరసింహుండిటే వచ్చుచున్నాడు.

(అమరసింహుండు ప్రవేశించును.)

భీమ—అమరసింహా? మనకార్యములు సాధించుటయెట్లు? ఆ ఇచ్ఛనీకుమారిం జూడనిది నామేను పులకరించుచున్నది. ఆకన్యాలలామ మృదుమధురస్వరము విన

కుంజిన, నాశరీరము వ్యర్థము. ఆసుందరిం జేపట్టనంగాని నాకానందము. ఆసుకుమారి స్నేహమే లభింపనిచో నా రాజ్యము, నాసంపద, నాజీవితము వ్యర్థమని తలంచెదను.

అను—దేవా? మీకీ విచార మేల? అంధ్రుల కీ:వరకే, యొక తెను పుత్రెంచియుంటిని. ఆమెను నీకను గుణ రూపసౌందర్యాదులను బొగడి, యామె మనస్సు త్రిప్పి వేయును. అదియుంగాక జైతపరమారునకు నీవంటివాండల్లుండవుట మహాభాగ్యమేగదా?

భీమ—ఆచిగురుబోడి రూప మామన్మథునికైనను లేదు.

సీ॥ చంద్రబింబముబోలు సఖియ నెమ్మొగమొప్పె
తారకావళిసాటి దంతములును
కలికివాల్చూపులు కలువతూపుల రాజు
బాణంబునకుసాటి బరగు సఖియ;
విషధర వేణియు విపులమౌ కంఠంబు
గానము సౌందర్య కంబుకంఠి
శశికాంత నునుబాలో చెక్కిళ్ళు సమమయ్యె
బంధూకమున మోవి బంధువయ్యె?

తే॥గీ॥ మేనిబంగారుచాయతో మెఱయుచుండె
భామగుబ్బలు భద్రకుంభములుదనరె
లేమలేనాను గనుగొన్న శేశవాన్య,
మ్మందగజయాన, బాల; య మార్యవర్య॥.

ఆచెలి నన్ను పరిగ్రహించునో, లేదో? ఏలయన పూర్వము నుంచి వారికి మనకుఁగల ద్వేషముచేత, పరమారుఁడు మాత్రము పౌరుష సంజాతుఁడు, ఎట్లులభించునాయని నామనంబు తల్లడిల్లుచున్నది.

అమర—ఏమి? మీయంతటివాఁడల్లుండగుటకు నిష్టపడనిచో నింకనక్కడనిలచునా?

ఉ॥ ఏపరమారుఁడే నినువివేకిగ, హీనునిగాఁదలంచినన్
చూపరులెల్ల మెచ్చ నతిచోద్యముగా నిపుడేగియాసభన్
నాపరమారుఁడున్ మనమునన్ బహుకోపము జెంది నాపయిన్
కోపముచేతవచ్చినను యుద్ధముజేసియుఁ దెత్తు నాసఖిన్.

ఇప్పటికైనఁ జక్కఁబడెనా? మదీయ ప్రయత్నములు. నేననేక మాయలుం బన్నుచున్నవాఁడ. అదియుఁగాక నీవు శుభలేఖ వ్రాసిన యాపరమారుఁడు మాత్రమొప్పుకొనఁడా? అతఁడు తప్పక నొప్పుకొనును.

భీమ—అమరసింహా? నీవింకను బాగుగా నాలోచించుట లేదు. మన మతమునకు వారి మతమునకుఁజాల వ్యత్యాసముగలదు. వారిది హిందూమతము. మనది జైనమతము అందువలన జైతపరమారుఁడు, ఇచ్ఛానీకుమారిని, నాకిచ్చుట కియ్యకొనఁడు.

అమ—ఆ...హిందూమతముకన్న మనమతము తక్కువయయ్యెనా? తక్కువగుటయుఁగాక, యరిభయంకర శత్రువర్గునకైన వెఱచి తనకూతును నియ్యకొనఁడో?

భీమ—అది కేవలము పిచ్చి యభిప్రాయము. తన మతము విడచి యన్యమతమునకు నిచ్చునా?

అమర—రాజొప్పినచో—

భీమ—ఇచ్చినీకుమారిఁ వరించదేమో?

అమర—ఎందువలన?

భీమ—బహుచతురత. ఆమె రూపలావణ్యమందేమి; ధను ర్విద్యాపాండిత్యమందేమి, నామె యిచ్చవచ్చినటుల వర్తించును.

అమర—మదనోన్మత్తుండవుటవలన, నీకేమియు గోచరించుటలేదు. నిర్వికారచేష్టలుడిగి, యొక్కించుక, నీ రమా రాజ్యమును, నీశూరత్వమును విచారించుకొనుము.

భీము—(ఆలోచించి) నాకేమియుఁ దెలియుటలేదు.

అమ—నీకెందుకుఁ దెలియును; మదనోన్మత్తవికారులకు, జూదరులకుఁగల భేదంబులునుడివెద—

సీ॥ రణరంగభూమిపై రాజులతోఁ బోరి
కనిసినధైర్యంబు గీర్తిదెచ్చు
నేవేళవిత్తంబు నింకుచుండినఁగాని
నపకీర్తినిందును నందులేదు.
కామినీహృదయంబు గాగలించుటఁగాని
నందైనగీర్తియు నణగిపోదు.
నిశిరాత్రిచోరత్వ నిర్జీవియైయొప్పి
వారిచేఁజిక్కిన వరలుగీర్తి

తే॥గీ॥ మదనతాపులకును మీ నైమజఫుజెంది
రయ్య గాననివియునాల్గు నరయగాను

యార్య మనసులుభేదించు నారసంబు
లనియెఱుంగుము భీమరాజాత్మరాజ!

మరియు, ననేక రాజాధిరాజుల నోడించి, రాజ కంఠీరవంబని పేరొందిన,నీకుయూపరిమాత్ముండుతప్పకఇచ్ఛినీని నొసంగును.

భీమ—అది కేవలము పొరబాటు.

అమర—ఇంకొక్కమాటనుడివెదను. సముద్రమువంటి మహా సముద్రమును కూర్చుకొని యీఘూర్జర రాజ్యలక్ష్మి నిఁజేపట్టవలయునని గొండంతయాసతో, డీకొన, నీవు చతురంగ బలసమేతుండవైపోయి, హారా హారీగఁబోరి హిమాలయపర్వతమువంటి యాసైన్యమును పెకలించి, మహమ్మద్‌గోరీని తరిమితివి. అది జ్ఞాపకముండెలియునా?

భీము—ఇప్పుడేమి చేయమందువు?

అమర—అట్లొప్పనిచో రాక్షసవివాహమునకుఁ జొచ్చెదము. ఆయబూపర్వతమును దగ్ధముచేసి, యారాజ్యమంతయు, మనవశపఱచుకొని, ఇచ్ఛినీకుమారిని దీసికొనివచ్చెదము. ఆ సేతుహిమాచలపర్యంతములలో నీకెదురాడు వారుఁగలరే?

భీమ—నిశ్చయము. మనకుఁగావలసిన యారత్నరాజమును దుఃఖపెట్టుట నాకిష్టములేదు. అయినను నీయిష్టము వచ్చినట్లుచేయుము.

అమ—ఇప్పుడే యాజైత్ర పరమారునకు సందేశమంపుము.

(నిష్క్రమించెదరు.)

(అవనికపడును.)

## 4వ రంగము.

సమయము—ఉదయము.

(అభయసింహుడు విచారముతో ప్రవేశించును.)

అభయ—ఇచ్ఛినీకుమారిక నన్నువరించక, పృథ్వీరాజును వరించుననని వింటిని. దాని యందమేమని వర్ణింతు. (సంతోషమున)

ఉ॥ పున్నమ రేలు నైముఖముఁ జూచిన నంకెన పుష్పమోపిరై
కన్నులు కల్వతూపులయి కంఠము కంబుకతిక్రమించి యా
క్రొన్ననదీవ పత్రముల కోమలమై పలనిల్లు పాదముల్
యున్న విధంబుఁ జూడ మన ముర్గ వికసించిన పత్రమైనహా॥

(రూపవతి ప్రవేశించును.)

రూప—నా ప్రయత్నము లెప్పటికి సఫలమగునో గదా? ఈమెను ఈభీమరాజును తప్పక పెండ్లిచేయవలయును. ఇందులకు యామె మేనత్తకుమారుఁడగు, అభయసింహుని లోబరచుకొంటిని ఇప్పుడేపలుకరించెద...... (నడచి) రాజకుమార! నీవేకాంతముగా కూర్చుంటివేల?

అభ—రూపవతి? నేచెప్పవలసిన సంగతియంతయు చెప్పితిని—నావిచారము నీకు తెలిసియేయుండెనుగదా?

రూప—నీవు చెప్పినప్పటినుండియు, యామెను లోబరచుకొనుచుంటిని. తొందరయేల.

అభ—తొందరకు కాదు. ఆమె మరియొకరిని వలచి యుండుట వలన.

రూప—అభయము నీకెంతమాత్రము వద్దు. నానేర్పుకొలది యామెను ఒప్పించెద.

అభ—నీవం త్రటిదానవని నాకు తెలుసు.
రూప—తెలియునుగాని తుదకు నాకిచ్చెడిది,
అభ—నీకిచ్చెడి దానికే భయము లేదు. నీవు సిద్ధపరచిన వెంటనే నీకిచ్చెద.
రూప—ఆమాటలన్నియు యిప్పటిమాటలే, అప్పుడు......
అభ—రూపవతీ? నామాటలయందు నమ్మక ముంచుకొని యామెను వరించినట్లు చేయుము,
రూప—అవును. ఆమెం నీచిన్నతనపు చేష్టలు, బాణవిద్య యందలి నేర్పు మొదలగునవి యన్నియు చెప్పుచుం డును. దానినిబట్టి నిన్నేవరించునని నానమ్మకము.
అభ—ధన్యుడ. ధన్యుడ. నీవాకార్యమునందు మాత్రముం డుము. (నిష్క్రమించెదరు.)

(అవనికపడును.)

---

## ద్వితీయాంకము.

### 1వ రంగము.

(జైతపరమారుండు సామంతరాజులు కొలువుదీర్చియుండుట)

జైతపర—రాజోత్తములారా!

ఉ॥ మిత్రములార! మీరలిపు డేకొనివేగమె సైన్యసిద్ధులై
శత్రుండు భీముఁడన్ దొడరి సంగరమందు జయించెవాని యా
పుత్రకళత్రబంధువుల భూరిధనోన్నతులార, మీరలా
శాత్రవుంరాజ్యలక్ష్మివర సంభ్రముతో గయికొందు మీక్షణం

భటుడు—(ప్రవేశించి) మహారాజ! నమస్కారము. భీమ దేవునిదగ్గఱనుంచి రాయబారివచ్చియున్నాడు.

జైత—తీసుకొనిరమ్ము.
భటుడు—(నిష్క్రమించి రాయబారితో ప్రవేశించును.)
జైతెప—ఓయీ! నీపాపీఠం బలంకరింపుము.
రాయభ—మహారాజా? మారాజగు భీమదేవుఁడు మీకు
రాయబారమంపినాఁడు.
జైతప—ఏమీ? రాయభారమంపినాఁడా? అతనికి మాకు
వ్యవహారం బేమియులేదే? అయిన చెప్పుము.
రాయ—రాజా! నన్ను మరసింహుఁడందురు. మారాజు చెప్ప
మనిన మాటలు చెప్పుచుంటిని.

సీ॥ భువిలోన విఖ్యాత భూరిమనస్కులై
బాదలుచుండెడి గీర్తిఁ బొందితీవు
అంతరంగమునందు న్యాయంబుపరిపాలఁ
బ్రజలఁబోషించు నాప్రభుఁడవీవు
యాయబూగినేలి యందమౌయశమును
చెన్నొందినాసనా సీనుఁడీవు
ఘనుఁడయ్యు సముఁడయ్యు ఘనతఁదాల్చినవీర
వరుఁడయ్యు కరుణాసాగరుఁడవీవు

తే॥గీ॥ ఖ్యాతి నీతియు వినయంబు గాంచితీవు
వన్నె కెక్కితిసిరుఁడై వంశమందు;
గంటె, సాహసబలుఁడవీవు గగనరాజ!
నావినయవచనములిను నవ్యహృదయ॥

జైత—ఓయీ? ఇవి భీమదేవుని వాక్యములే? సాంతముగా
చెప్పుము.

రాయభా—భూపాల!

సీ॥ కుహూకుహూధ్వనులతోఁ గోరడంతదళముతో
ఘూర్జరరాజ్యముఁ గూల్చెఁగోరి!
అంతవానినియొక్కఁ డదలించిరణమున
రాల్చివెచ్చెనుగదా! రాజభీముఁ
డంతమ్లేచ్ఛుఁడు సోమనాథుని పట్టణ
మనుసరించినవేళ దుగల జేసె
తనకృపాణమురిపు ధన్యులగూల్చను
యేవేళవాడియై యెదురుజూచు,
తే॥గీ॥ అలరు సుగుణాఢ్యుఁడతుల ధైర్యమలరి
నలఘుఁడగువాఁడు మీపట్టికనుసరించు
నిక్కవంబుగ సౌశీల నీదుపుత్రి
వరయ భీమరాజుకుఁబోలు వరయుదేవ॥

రాజా! నీతోజుట్టరికంబుఁ జేసుకొన నుత్సాహపడుచుంటిని నీపుత్రిక సౌందర్య విలాసములచే భీమదేవుని యంతఃపురంబలంకరించుగాక, ఇచ్ఛినీకుమారిని ఘూర్జరరాజ్యమునకు సపత్నిగాఁ జేయుదుగాత.

జైతప—(రోషముతో) ఏమీ? తెలసె, తెలసె?

ఉ॥ క్షత్రియవంశజుండ బలశాలులయింట జనించినాఁడ నా
గోత్రమొకించుకైన యెరుగున్నది లేక, యిదేమివింత? మ
త్పుత్రికనీయమంచునతి మూర్ఖుఁడు భీముఁడు బల్కపాడియే?
ధాత్రిని వానివంశమున ధర్మమె? నీతులుగావు మిత్రమా!

హిందూమతమును విడచి, జైనమతావలంబకుండగు భీమునకు నాకూతునిచ్చెదనన్న మాటకల్ల. పవిత్రవంతమగు నావం

శమునకు గళంకము తెచ్చుటకు యీపరమూఢుండంత బుద్ధి హీనుండు గాఁడు. భీముఁడఖండ సైన్యముఁగలవాఁడని, విశాల రాజ్యముగలవాఁడని భీతిల్లు వారెవ్వరులేరు. జైనమతముచేఁ దన్నును దనవంశమును గలుషితముఁ గావించుకొనిన వాని కెట్లిత్తు నాకూతురును,

రాయభా—రాజా? అట్లయిన, చివరమాటలువినుఁడు-మీరొప్పవిచో, నఖండ సైన్యములతో వచ్చి, నీరాజ్యమును, నాశనముచేసి, నీకుమార్తెను తీసికొనిపోవును.

జైతప—(రోషముతో) ఆ. ఏమి? ఏమి? యీయాగడములు. ఓరాజులారా? మదాంధుఁడైన యీభీముని జక్కాడవలయు - జైనమతముచే సగముచచ్చి పడియుండక యీప్రతాపంబులేల? హిందూమతములోని కన్నియలనే కోరెనుగా? బలిష్ఠమగు సర్పము చలిచీమలచే ఛచ్చుచుండెను. భీముఁడట, చతురంగబల సమేతుఁడట, ఛీ ఛీ! యీనీచుని నామముఁదలచిన, పవిత్రజలపూరితములతోఁగూడిన,హిందూమతమున కెక్కడఁగళంకమువచ్చునోయని వెరగందుచుంటిని. (తలయూచి) కానిమ్ము.

మ॥ ఇపుడేబోయి వివేకహీనుఁడగు ధాత్రీంద్రుండు నాకాంతుఁడా
రిపుఁడౌమంత్రి భటాళితో రహినివారింబోరిసాధించి భీ
ముపురంబున్ బరిమార్చి నాతనికరంబుల్ ఖండనల్ జేసెదన్
త్రిపురత్నంబారుఁగూడి వత్తునిదిగో? దిక్పాలకుల్ మెచ్చఁగన్।

(అందరునేకగ్రీవముగా హిందూరాజ్యలక్ష్మికి జేయ్, జేయ్, యందురు.) (నిష్క్రమించెదరు.)

## ౨వ రంగము.

(ఢిల్లీలో పృథ్వీరాజు కరుణరాజు సామంతరాజులతోఁ గొల్వుదీర్చియుండుట)

బంట్రోతు—(ప్రవేశించి) మహారాజా తమదర్శనార్థమై భీమదేవుని పినతండ్రికుమార్లగు ప్రతాపాదులు వచ్చియున్నారు.

పృథ్వీ—తీసుకొనిరమ్ము

(బంట్రోతునిష్క్రమించి ప్రతాపాదులతో ప్రవేశించును)

పృథ్వీ—రాజకుమారులారా? ఆయాపీఠంబులం దధిష్టింపుడు మీకు శ్రేయమే కదా?

ప్రతా—రాజోత్తమా? ఏమనివిన్నవించెదను. మాజీవితములు కడువింతగాయుండును. మాదిఘూర్జరదేశము,

ఉ॥ ఘోరుఁడు భీముఁడో ఘనుని-సోదరులం దముదండకాటవిన్
జేరఁగ బొమ్మటంచనిన-ఛీ యని వానిదిపట్టపేనుగున్
జేరి గడంగి నేఁడ్వురము-చేడ్పడి నేఁగఁగ మాదుతండ్రినిన్
ఘోరముజేసి చంపెనిది-గోమము జేరితిమయ్య? భూవరా

పృథ్వీ—రాజోత్తములారా భీమునకు మాకు ప్రబలమగు విరోధములుజరుగుచున్నవి. పుట్టుకచే మీరుశత్రుకోటిలోనివారగుటచే మీకాశ్రయమిచ్చుట రాజనీతికి విరుద్ధము. భీముఁడుదాయాదులన్న మాటలమరచెనుగాఁబోలు,

ప్రతా—మహారాజా? మీవంటివారి యనుగ్రహమును సంపాదించుకొని యాపగతుని దొరయ జేయనెంచినారము,

పృథ్వి—అయినను, భీమదేవునితో బద్ధశత్రుత్వ మవలంభించియున్నారని యిదివరకే వినియున్నాడను. మీ మాటలయందసత్యమేమియు లేదు. కావున మీకా శ్రియమిచ్చితి. సుఖముగా కాలముగడుపవచ్చును.

ప్రతా—ఇప్పటికిఁగదా ధన్యులమైతిమి.

కరుణ—(తనలో) ఛీ; యీపాడుముండాకొడుకుల కాశ్రియ మిచ్చుట నాకెంతమాత్రము నిష్టములేదు. వలదన్న వినడు. తాఁబట్టిన కుందేటికి మూడే కాళ్లన్న పద్ధతిఁ గలవాఁడు పృథ్వీరాజు. ఆభీమునకు వీరెంతశత్రువు లైనను, సమయమునకు మొక్కటియే యగుదురు. ఇంతమాత్ర మాలోచన లేకాశ్రియమిచ్చె. పెద్ద వాఁడను, తండ్రితరువాత తండ్రియంత వాఁడనే నుంటినిగదా; నన్నడుగగూడదు? వలదన్న వారి తో నవారిదే. అదియుంగాక, క్రొత్తగావచ్చిన వారిలో సత్త్వాగ్రహించక, వారేయుద్దేశముతో వచ్చినారో తెలుసుకొనక, యాశ్రియమిచ్చుట మంచిదా? అయి నను చెప్పిచూచెద (ప్రకాశముగా) పృథ్వీరాజా! నీరాజ్య పరిపాలనములో కొన్ని సమపాయములను చేయవలయును.

పృథ్వీ—జనకా! అవేవియో చక్కఁజేయరాదా?

కరుణ—చక్కఁజేయ కేమి? నీకేమైనఁ గోపమువచ్చినచో

పృథ్వీ—అదేదియో చెప్పరాదు.

ప్రతా—మామీఁదకుఁ గాదుకదా?

కరు—క్షాత్రగా వచ్చిన వారికాశ్రయమిచ్చుట.

ప్రతా—ఆపదలలోని వారిని రక్షించుట నాయుద్దేశము.
తొల్లి పూర్వము శ్రీరాముడు శత్రుకోటిలోనివాడగు రావణుని తమ్ముడైన విభీషణున కాశ్రయమిచ్చె, శత్రువైననేమి?

ప్రతా—నేననుకొనినంత యైనది. కాని పృథ్వీరాజుమాత్రము మాటతప్పువాడు కాడు.

కరుణ—అట్లయిన నీయిష్టమువచ్చినట్లు రాజ్యము చేయుము.

(ప్రతాపాదులు తక్కినవారు నిష్క్రమించెదరు.)

ప్రతా—ఓదేవా! దేవా? దీనబంధూ! ఆపదోద్ధారకా?

ఉ॥ పాయని వేడ్క నెప్పుడు నుపాసనజేతు రమాధినాథునిన్
బాయక పాదపద్మముల పైనుచితోదయము కెప్పుడేగునా
నాయధరంబులోకియని నాసనుయొంటిని, వాసుదేవ, నా
రాయణ వంశవర్ధన నిరంతరసౌఖ్యము మాకునీవుతన్

(నిష్క్రమించెదరు.)

(భీముడు ప్రవేశించును.)

భీము—ఆహా! ఇచ్ఛానీకుమారి! అందమా చంద్రుని కైనను లేదే? నీముఖారవిందం బెప్పుడు గాంచుదునో?

శా॥ ఔరా? యందమునం దువేశ్యగ గనన్ యీయూవపుల్ రంభ తే?
నారా? దంతము లెల్లనే సొగసు మే లాహావిలాసంబులం
లేదా? శ్యామలు నెందుజూడఘనమౌ లీలల్ తనూవిభ్రమం
బీరాకామ్మనితోడ నీడుగలరా యీపుణ్య లోకంబునన్

గీ॥ కాంతగాదిది రత్నాలకమ్మగాని
సుదతిగాదిది కాయజుసొమ్ముగాని

కలికిగాదిది మరునిరాచిల్కగాని
ఇంతిగాదిది మల్లెపూ-బంతిగాని॥

సొగసులచేటికా! నీతో మరుడురా వెరచుచుండెను. నీరూప కోలలకిందన మన్మథబాణముల నుంటగలిపితివి. నీయావన సౌందర్యాతిశయములలో రంభనుమించితివి. నీతో మదన సామ్రాజ్యమునుజెంద నువ్విళ్ళూరు, యీయరిభీముడు దప్ప మరెవ్వరైయుందురు. నాసామ్రాజ్యవైభవమంతయువిన్న తప్పకవరించును. (తలయూచి) కొంచెంసందేహమే? ఏలయన మతభేదమొకటి. హిందూమతమునుండి ఈమతమున కేలవచ్చితిని. రాకుండిన యీమె యేయభ్యంతరములేక వరించియుండును. ఆయందమును తలచినకొలది నాకమితానందము గలుగుచున్నది. ఈశిలావేదికమీదఁ గూర్చుండెద.

(కూర్చుండును)

భటుడు—(ప్రవేశించి తనలో) ఛీ! ఈమన్మథుండెప్పుడుజన్మించెనోగదా? మన్మథబాధకు తాళలేకమానవులు బలహీనులగుచుండిరి. అగ్ని తానాశ్రయించువారిని నాశనముచేయును..కామముగూడ నెవరినినాశ్రయించునో వారిని నాశనముచేయును. ఎన్నికట్టెలు తెచ్చివైచినను నగ్నికితృప్తిలేదు. ఎన్నిసుఖము లనుభవించినను కామమునకు దృప్తిలేదు. ఎవ్వడుజ్ఞానముకలిగి కామమును నడగదొక్కునో వాఁడేధన్యుఁడు. లేనిచో వానిజన్మమే దుఃఖభాజనము. అదుగో! ప్రత్యక్ష దేవుండిడుగో! ఈ దేవుఁడిచ్చినీకుమారి సౌందర్యాదు

లవినియామెనువలచి, సదాయామెను జిహ్వాయందు తాండవమాడుచుండును. అందువలననీతని హృదయమునగ్నివలె బాధింపఁదొడగెను. అబూగడమునకు నరగిన, యమరసింహుండింకనురాకఁ బోవుటచేత నుఁ యింతయధికమయ్యెను. ఒకచోటస్థిరముగా గూర్చుండుటంతయోపికయులేదు కామపిశాచములకు లొంగి తిరుగుచుండెను. పలుకరించెద! మహారాజా నమస్కారములు.

భీము—ఓరీ; నీవెవఁడవు. ఎక్కడకుఁబోతివి.

బంటో్రి—తమ పినతండ్రికుమార్లగు ప్రతాపాదాదులెందుండెరోయరసిరమ్మంటిరి, వారిజాడలు తెలుసుకొంటిని.

భీము—ఎక్కడయుండిరి?

బంటో్రి.—మహాప్రభూ? ఢిల్లీశ్వరుని నాశ్రయించినారు.

భీము—(రోషముతో) ఛీ;ఛీ; తుచ్ఛులు, తుచ్ఛులు, చాళుక్యవంశ సంభవులగువారు తమవంశ శత్రువులగు చోహీనవంశస్థుల యింటికి నీచులైపడియుండిరా? మా వంశమున కళంకము తెచ్చిరి. అంతకంటె ముష్టియెత్తుకొని బ్రతుకుట మేలు.

బంటో్రి—మహారాజా? ఢిల్లీశ్వరుఁడు గొప్పసైన్యమును గూర్చుకొని మీపైకి దాడివెడల ప్రయత్నముచేయుచున్నాఁడు.

భీము—మంచిది. పొమ్ము. (బంటో్రితు నిష్క్రమించును.)

భీము—(ఆలోచించి) ఢిల్లీశ్వరుండగు పృథ్వీరాజు తప్పకదాడివెడలును, అజ్మీరురాజ్యము ఢిల్లీలోగలియుటచే,

వానిరాజ్యము ప్రబలమైనది. ఇప్పుడుమావంటి మహా శూరులు సహితము హృదయశల్యములగుచున్నవి. గర్వము కొంతనణచినగాని సౌఖ్యంబుగలుగదు. (అటు చూచి)అదుగో, అమరసింహుఁడిటువచ్చుచున్నాఁడు. ఏమి శుభవార్తో?

అమర—మహారాజ! నమస్కారములు.

భీము—వార్తలేమి?

అమ—నేను తమకొరకై యెన్నిరీతులవిధముల చెప్పినను, వినలేదు.

భీము—(రోషముతో) వినకయేను నెను. ఆదురాత్ముఁడు వినడని నాకు తెలుసు. అయిననేమనెను.

అమర—మీరు జైనమతముచే, చెడిపోయిరనియు, హిందూస్త్రీలనుకోరిన, నరకమున కాహుతియగుదువనియు, ఘూరియొక్కతూర యిట్లడిగిన తగినశిక్ష విధించెదననియు నుడివెను.

భీము—(రోషము) ఆబూగడమంతయు మంటగలుపుదునన లేదా?

అమర—అనకేమి?, ఆబెదరింపులకు వారిట్లనిరి. నిన్ను యుద్ధమునందు యమసదనమున కంపెదమనిరి.

భీము—(రోషముతో) అరే! దురాత్మ! నీరాజ్యమంతయు నిప్పుడే బూడిదెపాలుజేసెద - భీముఁడొక నలుసువలె కనుపించెనా? ప్రళయఘోషవంటి యీభీముని రోషమునకుఁ బాతుఁకొండగు నీయపాతుకొనిఁ బరమారుని నెవరు రక్షించెదరో చూచెదగాక! ప్రచండసైన్య

మను సముద్రమును, యీబాగడమును, నౌకతో నెట్లుదాటునో చూచెదగాక. తనవంటివాడెంత ప్రయత్నముచేసినను దొరకని, నావంటిసంబంధము దొరకినందుకు సంతసించుటకుమారుగా దోషారోపణంబు జేసి నిరసించెనా? ఇందులకుతగిన ప్రతిఫలము జైతుండు జెందకపోడు. ఆరాకుమారి ఢిల్లీశ్వరుని వరించెనా? కానిమ్ము, ఆయధమాధముని నెట్లువరించునో చూచెద. అమరసింహా? యుద్ధసన్నాహంబుజేయుము.

ఉ॥ ఓరి; దురాత్మ; నీదుబలముం జవముం సహియింపజేసెదం
స్వైరవిహారధీరుఁడను సారసలోచనుడుండ నాకిటం
జేరములున్నవా? పలుక నీధరణిం నినునొక్క పెట్టునం
కారడవింజరింపనిదె కాయలుగూరలుఁ దిండిజేసెదరం

అమర—రాజా? యాతని రాజ్యముతో నీకేమి? ఇచ్ఛినీకుమారికదా మనకుంగావలసినది. శాంతించుండు. గోళ్ళతో జీరుదానికి గొడ్డళ్లేల? అంతయు నేను జక్కజేసెదను. (నిష్క్రమించెదరు.)

(అవనికపడును.)

---

౩వ రంగము.

పుష్పకుటీరము.

(అభయసింహుఁడు ప్రవేశించును)

అభయ—రూపురేఖ కళావిభ్రమంబులతో నీతో యెవ్వరుం దిరయు సాటిగాదు. ఏమియందము. ఏమియందము? పున్నమచంద్రునివలె ముఖబింబము. ఇచ్ఛినీ, నీవెంత

రత్నాలబొమ్మవైనను, నీమేనత్తకుమారుఁడని తలం
చుము. ఏమి యీయందము. మరపురాదు.

ఉ॥ ఆకలకంఠకంఠి నవయౌవను యిందు నిభాస్యయానతీ
నాకవహించియున్న కనకంబు సలాకువుబోలి యాతనూ;
శోకములంటి చన్నవలు కోమల కల్వలవక్త్ర కన్నులుణ్
నాకములోనలేదు యిది నాకవిభుండును మెచ్చు నీ చెలిణ్॥

తే॥ కలికి; నీమేను బంగారు గనివిగాని
సఖియ; నీకరములనగ నవ్యశాఖ
కుంతలీ; శుకపికము నీకుచములఁజూచి
కాటుక కొండలో యనగను కదలిపారె

(తెరలో)

ఉ॥ చక్కనిమాటయౌను యిల చారువిలాసము రంభసాటియే
చక్కనితేనెకాను ముఖ జెక్కులు కాంచన మొగ్గతావియుణ్
మెక్కుడు చారునాసికము మేలగు కల్వలపత్రితూపునన్
చక్కడు సోగకన్నులును చయ్యన యెంచదరంబె రూపముణ్

రూపవతి; (ప్రవేశించి) రాజకుమారా? కుశలిమైయుంటివా?

అభయ___కుశలముల కేమి? నీవు, మీాయిచ్చినీయు కుశలము
గా యున్నజాలును.

రూప___అందరి కుశలముకావలయును.

అభయ___మనప్రయత్నము లేమైనను సాగుచున్నవా?

రూప___ఆ! అవ కేమి? తొందర యేఁదుకు.

అభయ___తొందరకాదే కోదనుసింగములన్నియు కాచుకొని
యుండెను.

రూప___అందువలననే, సదా నీవిషయము విచారించుచుం
టిని. నాబహుమతి,

అభ:య—నీబహుమతి కేమిలే! యిప్పటికి యీబహుమతి తీసుకొమ్ము. (పూలహారమిచ్చును) మంచిపారితోషిక మిచ్చెదను.

రూప—రాకుమారీ! చెప్పమరచితిని. స్త్రీలఅనురాగ లత మిగుల శోచనీయమైనది. ఇదివరకే యాధారమును జుట్టుకొనియుండెనో; యూయాధారములనుండి విడదీయవలయును: మరియొకసంగతి. కొలదిదూరములో నొకబైరాగి వచ్చియుండెను అతఁడు సాముద్రికలఁ జెప్పుచుండెను. వచ్చెదవా?

అభ—రాకేమి? వచ్చెదను.

రూప—ఇంకొక్క సంగతి. నేనెందుకు యింతగా చెప్పుచుంటినో తెలియునా? నేను నీతోయిచ్ఛినీవిషయము చెప్పి, ధవములాగుచుంటి ననెడి వాకుకనాకెందుకు. అనిమాత్రము విచారించుకొనుము.

అభ—అట్లైన్నడుఁ దలుపద్దు. పదవెళ్లుదము (తెరచుట్టుతిరుగుదురు.) యింకెంతదూరము.

రూప—దగ్గరకు వచ్చితిమి. (నిష్క్రమించెదరు.)

బైరాగి—(ప్రవేశించి) నేనెట్లయిన నాపని నెరవేర్ప వలసిన విధి. నేను భీమునకు ఇచ్ఛినీకి గూర్చెదనని చేప్పియుంటిని - ఆవాగ్దానము నెరవేర్చుట కిదియేసమయము. యీసైత కుమారికను నెట్లయినను మోసపుచ్చి, ఇచ్ఛినీని గొనిపోవలయును. ఇందులకు రూపవతిని పంపితిని. నేఁడో రేపో వచ్చెదననియు, నన్నికట్టడనే

యుండమనియు చెప్పెను, కాని యెటులజరుగనున్న
దో; యెవరోవచ్చుచున్నారు. (కూర్చుండును.)

అభయ—(రూపవతితో ప్రవేశించును.) ఎంతదూరము దీసి
కొనివచ్చితివి.

రూప—అదుగో? ఆకనంబడు బైరపు గడ్డపు మనిషియే!

అభయ—ఆమనిషియేనా?

రూప—అవును. (సమీపించి) అయ్యా: మారాజకుమారు
నకు ఫలాఫలములం జెప్పుడు.

అభయ—ఎవ్వరుమీరు?మహాదేవు. మహాదేవు.

రూప—నన్ను రూపవతియని యందురు. ఆయన జైత్రపర
మారుని మేనల్లుండు.

బైరాగి—బైరో? (చెయ్యిపట్టుకొని) రాజకుమార మీకో
ర్కె మిక్కిలి గొప్పది. యొకయువతినిం బెండ్లాడ ప్రయ
త్నము చేయుచుంటివి. అవునా? కాదా?

అభయ—అవును.

బైరాగి—నీవిషయమై యొకయువతి ప్రయత్నము చేయుట
లేదా?

అభయ—నాకోర్కె యీడేరునా?

బైరాగి—తప్పక నెరవేరును. (నిష్క్రమించెదరు.)

(అవనికపడును.)

---

## 4వ రంగము.

(ఇచ్ఛినీ గృహాంతర్భాగమున గూర్చుండి ఇచ్ఛినీ విచారపడుట)

ఇచ్ఛి——హా! దైవమా? ఎటులఁగానున్నదో? నాతండ్రి భీమదేవుని సందేశము నిరసించినందుకు నాకు సంతోషమే? బలశాలియగువానితోఁ బోరసల్పలేరని నాతలంపు-ఈ భీమునివలన మాకు రానున్న దుర్నివార్యములగు నాపదల దలచినపుడెల్ల నాయుల్లము దల్లడిల్లుచుండును. నావలన నాతండ్రికి, బంధువులకు, గలిగించుచున్న కష్టములు మేరయే లేవు. ఆపదను తప్పించదలచినచో భీమునిఁ బెండ్లాడవలయును. దండెత్తివచ్చిన భీమునిఁ బారదోలుటయో!

సీ॥ ఏమని యుత్తరం బేసియ్యఁగలదాన
నెంచునదీరు నీసందియంబు
భీమునిఁ బెండ్లాడ బ్రియము లేదాయెగా
తప్పని తండ్రికిఁ జెప్పుదాన
కంఠీరవుండగు ఘనుఁడు నా తండ్రియా
మత్తుడౌ భీముని మదమడంచ
పృథ్వీశుమును నేను భూరి కోరికనుండి
పరరాజు నెట్టుల నరయుదాన
తే॥ గీ॥ గాన! యారాజుగుణశాలి కాంతురూపు
సత్యసామ్రాజ్య సింహాసన సరణికరణి
బోయి గనుగొన్న రాజుల భువినిగలరె?
యాసఖుండును నాప్రాణనాథుఁడౌను॥

మరియు నాప్రాణనాథుని సోయగంబేమని వర్ణింతును!

సీ॥ కమలంబులనుబోలు కన్గవ గలవాఁడు
పూర్ణచంద్రుని బోలు మోమువాఁడు
పసిడి ఛాయలమేను పైభానురజమును
పలక చెక్కిలి చేత బరగువాఁడు
కంజాత తూపుని కమనీయచైత్రుని
నిరసించు సౌందర్య నీటుగాఁడు
సింహమధ్యమువాఁడు చిలుకపలుకువాఁడు
ఖండచక్కెర మోవి గల్గువాఁడు
తే॥ యమ్మహాత్ముని శరణంబు లాన యునికి
నరసి యారాజవరరాణి నౌదునేను
జేరి, యతని శుద్ధాంత శయ్యపైన
క్రీడసేవించి మరునినే వీడఁజేతు॥

కాని యన్నివిధములం దనకుదగినవానిఁ జేపట్టి సుఖించుట యుత్తమమా; లేకతనకు, బ్రతికూలుండగువాని జేపట్టి యా వజ్జీవము దుఃఖభాజనముగా యుండుటమేలా? లేక, తాను ప్రాణత్యాగముఁజేసి, తానుసుఖించి, తనవారిని సుఖపెట్టుట మంచిదా! ఇందులకు నాత్మహత్య మంచిదికాదు. భీముని నెదురింపఁగలిగినవాఁడు మెవ్వారైయుండును, పృథ్వీరాజుతప్ప మరెవ్వారైయుండును. ఆయనకు బరోపకారబుద్ధి యున్నదో లేదో? ఈలోపుగా పృథ్వీరాజునకువర్తమానమంపి, యతని సాయముపడవలయును. ఇట్లు పంపిన దోషమా!

సీ॥ అలనాఁడు పృథ్వీశుఁడౌ నలుబిలువంగఁ
బ్రియహంస బంపెగా భీముపట్టి
అలనాఁడు దేవకీ నందను బిలువంగ
బీదవిప్రునిబంపె భీష్మపట్టి
అలనాఁడు సత్యవంతుల సత్యబిలువంగ
సత్కీర్తిబంపె నశ్వపతిపట్టి
అలనాఁడు మకరాంక నాత్మజుబిలువంగ
తనచెలి బంపెగా దైత్యపట్టి

తే॥ వారలే యిట్లునడచిన తీరుగాన
ధర్మశాస్త్రంబు భువిలోన దప్పయెంచ
నేరికిఁ దరమా స్వయంవర మనయగాను
క్షత్రియకులంబునులేదె జగతిలోన॥

రూపవతి— (ప్రవేశించి) అమ్మా! యేనో యోచించుచుంటి
వి. నాకుఁదెల్ప రాదా!

ఇచ్ఛి— నానున్న నాపదలఁగూర్చి

రూప— ఆయాపదలఁ బోగొట్టుటయెంత. భీమదేవుని వరిం
చుము. ఘూర్జర రాజ్యమును జేపట్టుము.

ఉ॥ కంతుని రాజ్యమేలుచుత డందరిలోనను బేరువొందగా
సుంతయు జంకులేని యరి సుందరతుండన భీముఁడేగతిన్
సంతసమొంద రాజులను జక్కగ బాలనచేయుచుండెనో
యింతిరో యాతనిన్ నుడువ నేరికిశక్యమె యెందుజూచినన్॥

ఇచ్ఛినీ— రూపవతి? నీవన్నది బాగుగా నే యున్నది. భీముఁడు
నీకంటికొక దూతము లాగున గన్పించిన, నాకం

టికి నొకనలుసువలె గాన్పించుచుండెను. అట్లగనబడ
నిచో తప్పక వరించియే యుందును.

రూప—ఆపదను దరించుటకు నుపాయముఁజెప్పితిని.

ఇచ్ఛ—ఏ యుపాయములు లేవా?

రూప—ఏమున్నవి?

ఇచ్ఛ—భీముని జయించఁగలిగిన యొకరాజును నాశ్రయించుట.

రూప—ఎవ్వరున్నారు.

ఇచ్ఛ—పృథ్వీరాజు.

రూప—(నవ్వును) అమ్మా! నీవెంత తెలివితక్కువదానవు. తనతండ్రినిచంపిన భీమరాజును నెదిరింపలేక, నూరకుండెను. అట్టివాడా.

ఇచ్ఛ—పృథ్వీరాజు సమయముకొరకు నూరకుండెను.

రూప—అది రాజనీతి లక్షణముగాదు.

ఇచ్ఛ—రాజనీతి కాకపోయిన పోనీ,—అడిగినదానికి సమాధానము చెప్పుము.

రూప—లేదమ్మా! లేదు. నీయిష్టము. అచలేశ్వరాలయమున కొకసారి వెళ్లుదమా?

ఇచ్ఛ—అట్లే పోవుదము. నాజనకుని ననుమతినిఁ బొందవలయును.

రూప—అట్లుకుదురదు. నీతండ్రి యిష్టపడడు. ఈ రాత్రియే యభయసింహునిఁ దీసికొని వెళ్లుదము.

ఇచ్ఛ—అభయసింహుఁడు వచ్చినచో, నట్లేపోవుదము.

సంప—అచలేశ్వరాలయమునకు యొక బైరాగివచ్చియున్నా వాఁడు. ఆయన రెండుమూడురోజులలో వెళ్లును. నేఁడే పోయిన దర్శనము దొరకును.

ఇచ్ఛి—ప్రయాణము సిద్ధముచేయుము. (నిష్క్రమింతురు)

(అవనికపడును)

---

౫వ రంగము.

పుష్పకుటీరము.

(అభయసింహుఁడు శిలావేదికపై గూర్చుండును.)

అభయ—ఏమి యీప్రపంచ విచిత్రము. ననపోయగంబే మరిచెప్పను-ఇందలి తేటులు యెంత యానందముగా తమ ప్రియులతోనుండెను! అందువలననే ప్రపంచమున, స్త్రీ సంయోగమున బలమేధా గుణసంపన్నులకు సంతతి గలిగించుటయే ప్రకృతిధర్మము. స్త్రీ పురుషులకు తమ శరీర, ఆధ్యాత్మిక, ఆదర్శముల కనుకూలమగు జతనె ప్పుడు వెదకుచుందురు. ఇట్టిజత సమకూడినఁగాని సత్సం తిఁగలుగదు. సాంఘికమర్యాదలను, వధూవరుల హ్రస్వ దృష్టివలనను, యనుకూలదాంపత్యము బహుయరుదుగనే సమకూడును. అథవా వధూవరుల యూహాలొక్కటి గానుండి, చివరకు భిన్నముగానుండును. ఒక సంబంధ ము తెచ్చుకొనినను, యావజ్జీవము దాంపత్యానుకూ ల్యత కలుగుననియే నెవ్వరును నెరుగజాలరు. యననుకూ లమైనప్పుడు అనుకూలమైనవారితోఁ బోవుటయే వ్యభి

చారము. ఇప్పుడు ఇచ్చినీ విషయమై యూహకుందునా, యాద్రిగులుచేసురణ మే-(ఆలోచించి) ఓభృంగరాజమా? యెంత యానందముగానుంటివి? నీప్రియులు సహితమెంత సంతోషముగానుండిరి!.

సీ॥ జడవిచ్చివింతగా జారు మోమమరించి
యదిషోకో, యిదిషోకో యానెను పొన్న
కస్తూరి మేనుంచి రజపుబైటమరించి
యదినీటో యిదినీటో కేతకనెను
జాపాకుసుద్వల్చి చందనమలరించి
యదిలెస్సా యిదిలెస్సా యనెనుకలువ
రంగైనబంగారు రాణించునగలలో
యదిమేలో యిదిమేలో చూతకనెను

తే॥ కమ్మకస్తూరితిలకంబు జిమ్మిసాయ
రమ్మని, నిన్నునీచెలులిల రంగుతళుకు
తిలక మున్నొదుటందున దొలకెబూని
యందొ? యింకనోయందమం చడుగుచుండె॥

రూప—(ప్రవేశించి) రాకుమారి! నీవేధన్యురాలవు. ఇచ్ఛానీ, నిన్నే వరించెను.

అభయ—ఆయువతినాకు లభించునో, లభించదోయని శుష్క కాష్ఠములాగున క్షీణించుచుంటిని. ఈవ్వాదయమున నేం డమృతమువంటి మాటవింటిని.

రూప—రాజకుమార! సార్వభౌముండగు భీమదేవుని నిరసించి, నీదయను గోరుచున్నది. నాజన్మచరితయేది?

అభయ---నీబహుమతియట్లే యిచ్చెదను. ఆమెయెట్లు ఒప్పుకొనెను.

రూప___ఆమెకు నేననేకబోధలుచేసి పరాయసంబంధము మంచిదికాదనియు, నీవుపృథ్వీరాజుతో భీమదేవునితో సమానముగలవాడవనియు చెప్పితి.

అభయ___అమేమనెను?

రూప___మీ బాల్యక్రీడలు, బాణవిద్యయందలి నేర్పునెప్పుచుండును అదియుంగాకయామెయచలేశ్వరునిదర్శింపగోరి నిన్నుసహాయమునకు రమ్మనిగోరెను. ఆమెయంతఃపురమునందుండి నప్పటినుండియు నిన్నుచూడలేదని విచారపడెను.

అభయ___ఎప్పుడువెళ్ళెను.

రూప___ఎప్పుడోనా? ఇప్పుడే?

అభయ___ఇప్పుడేనా?

రూప___ఈరాత్రియే?

అభయ___నీవుగూడవచ్చెదవా?

రూప___వచ్చెదను. ఆమెదేవతా దర్శనమునకు వెళ్ళుచున్నవిషయము నితరులనెవరికి తెలియనీయగూడదని యామెతలంపు. నీవునవారీబోయీలనుసిద్ధపరచుము. ఆమెసంతసించును.

అభయ___అట్లే? నిష్క్రమించెదరు.

(అవనికపడును.)

(అబూపర్వతము. అచలేశ్వరుని దేవాలయము
అర్చకుఁడు ప్రవేశించుట)

అర్చకు — నేఁడుమాక్షేత్రమునకుమాత్రై దేవతాదర్శనమునకు వచ్చెదగాన, నన్నిక్కడయుండుమని చెప్పెను. ఇప్పటికిజాము న్నర ప్రొద్దుపోయినది. (తెరవంకజూచి) సుధాకరుఁడు చక్కఁగా ప్రకాశించుచుండెను. ఆముద్దులగుమ్మ వల్ల రాజును మరపించుటచేఁ గాఁబోలు మరింతనెక్కుడుగా తారాంకుఁడు పొడగట్టుచున్నాఁడు. సవారిమోఁత వినవచ్చుచుండెను.

(తెరలో సవారిధ్వని)

బైరాగి — (ప్రవేశించును) ఈపూజారి యాముద్దులగుమ్మ యిక్కడకు వచ్చునని నుడివెను. షోడశకళాపరిపూర్ణవతి యని బిరుదుపొందిన, నామెను, చంద్రునకు రాహుగ్రస్త కరణి, భీమునిమ్రోల మామెకు నిల్పక పోదు నేనమరసింహనామాంకితుఁడఁగాను. ఇపుడే నావేషము తెలియకుండ కూర్చుండెద. (కూర్చుండును.)

(ఇచ్ఛినీ రూపవతి అభయసింహుఁడు ప్రవేశింతురు.)

ఇచ్ఛినీ — (దేవునియెదుట నిలబడి) దీనరక్షా!

ఉ॥ భూజల మగ్నివాయ్వచల మున్ మహావీరులు సృష్టిచేసి, నీ
వేజగమంతయుంనిబిడి పంతగ జీవులు సంతసించనిన్
గాంచేగ జేసితీవు నిను గాంచితి పార్వతీవల్లభా గనన్
తేజవినీవు మమ్మరయ తేజవుగాక త్రిలోకవందితా

ఓభక్తవత్సలా! దీనులరక్షించు చెడి యాదేవా!

సీ॥ దేవతలందరు దీనులపుచునీకు
భక్తులౌచుండిరి పరమపురుష
భక్తవత్సలుఁడని భక్తత్రాణపరాయ
ణుండనియు మునులుం బొగడఁగ
త్రిపురాంతకుండవై త్రిపురములచెండియు
విశ్వకంటకులను బీచమడపి
రాక్షసుల్ కెల్లను రాజులైబరగియు
గర్వులౌ వేల్పులఁగాచితీవు
తే॥ నీదుభక్తులౌచుబరగి నింగియందు
నివుణుఁడౌ మునిపుంగవు విశ్వమిత్ర
మరచి యీవులిచ్చితివీవు పార్వతీశ!
నేఁడు మమ్ములఁగావుమో నీలకంఠ॥

ఓ చిన్మయమూర్తి! ఆబూగడమునకు రానున్న కష్టముల దీర్పవా? భీముఁడుదండెత్తి నన్ను చెరబట్టనెంచి, యూరకుండుట పాడియా? దేవదేవా? రక్షింపు; రక్షింపు, పాహిమాం, పాహిమాన్, నమస్తే, నమః.

అభయ—(తనలో) ఆహా? యీమెనుజూచి యెన్నిదినములైనది. పూవిల్తుని మెరుంగైయుండునా?

సీ॥ వసుంధరాంగుడీ యిచ్ఛినీమచ్చటల్
గాంచి కౌగిటయుందు గాంచునొకో
ఏరాజ వరునకీ యెలనాగమధువిచ్చి
నచ్చకేళివిలాస మిచ్చునొకో

ఏమోహనాంగుఁడీ కామినియధరంబు
చే బారవశ్యంబు జెందునొక్కొ
ఏయెమ్మెకానికీ హేమవతిగనుఁగొ
నుట రహిభాగ్యంబు నొందునొక్కొ

తే॥ యీసుశీల వాసస్థాన మేమియొక్కొ
మేలుచూచినన్ రతికేళి నేలునొక్కొ
యేలకుండిన దీనినా కేలగూర్పు
వయ్యా! గౌరీశ! ముల్లోక పావనచరిత॥

(రూపవతి, ఇచ్ఛనిని బైరాగిదగ్గఱకుఁదీసికొనివచ్చి)

రూప — మహాత్మా! నమస్కారము.

బైరా — (తలయూపును.)

రూప — అయ్యా? మాకాకుమారికకు రాఁబోవు నాపద దెల్పుండు.

బైరా — శంకర్, శంకర్, (యిచ్ఛనిచెయ్యిపట్టుకొని) నీమనోరథంబు నాకుఁదెలియవచ్చినది. నీవు యొకరాజాధిరాజును వరించబోవుచుకొని యుంటివి కాదా?

ఇచ్ఛ — అవును.

బైరా — నీమనస్సునదలఁచిన రాజు నీకుభర్తయగునటుల లేదు వేరొకరాజును పెండ్లాడుదువు.

ఇచ్ఛ — అయ్యా? నేకోరినరాజులభింపనివో, నాకీజన్మమేల అప్రియుఁడగు యొకరాజును బెండ్లాడుట దుఃఖభాజనము

బైరా—తల్లి; నీస్థితినాలోచింపనశ్రు తోచుచున్నది. నేనేమి చేయుదును. నీమూలమున నీతండ్రికి యొక నాపద రానున్నది.

ఇచ్ఛా—నిజము. నేకోరినపురుషుఁడు లభింపని-చో, యీయాపదనుండి తొలంగుదుము.

బైరా—నీమనఃకాంతుడెవడో కనుగొంటిని. నాసినివరించుట దుర్లభము.

ఇచ్ఛా—మీరట్లనిన, నేనేమందును.

బైరా—అమ్మా? (ఆలోచించి) నీయందుజాలివొడము చున్నది. నీదీనాలాపములు నామనసు కరిగించినవి. నిన్ను రక్షింపపట్టుబట్టితిని. నాదగ్గఱనొక సిద్ధౌషధమున్నది. దానిని సేకరించి, కాళికాదేవినామంబున, నూటయెనిమిది సార్లు మంత్రము జపించుము. (నమోబాలాయైనమః అనియుపదేశముచేయును) ఈయౌషధమును సేకరించుము. (యిచ్చును.) (ఇచ్ఛని తిరి జపముచేయును)

రూప—అభయసింహా! రమ్ము; బైరాగిపిలచుచుండెను.

బైరా—రాకుమార! నీవుకోరినచిన్నదిదియేనా?

అభ—అవును. నన్నువరించునట్లుచేయుఁడు.

బైరా—చిన్నవాఁడా? నీవాచిన్నదానిని తప్పక పెండ్లాడుదువు. ఇందులకు నాదగ్గఱ యొక మూలికయున్నది. నీవామూలికను యీమెతల్పముదుంచితివా? ఆమెవరించును.

అభ—స్వామి! యెప్పుడు యిచ్చెదరు?

బైరా— ఇప్పుడేయిచ్చెదను.

అభ — ఎంత దూరము,

బైరా — యీపర్వతశిఖరమున నేదారకును.

అభ — ఇచ్చినీని విడచి రాజాల!

బైరా — మరొక్కప్పుడు వచ్చెదవా?

అభ — ఎప్పుడు

బైరా — నెలరోజుల యినతరువాత,

అభ — యీలోపల.

బైరా — మంచిదిగాదు నేఁడేయైన మంచిది.

అభ — రూపవతీ; యిచ్చినీ భద్రిము. నేనీయనతో వెళ్లి వచ్చెదను.

రూప — మంచిది.

బైరా — సంతోషం, సంతోషం. రూపవతీ; నీవింక బోవచ్చు.

(నిష్క్రిమించెదరు.)

అవనిక పడును,

---

# ఇచ్ఛనీకుమారి.

## తృతీయాంకము.

(ఢిల్లీలో పృథ్వీరాజు, కరుణరాజు ప్రతాపాదులు చాంధూభట్టు కొల్వుదీర్చి యుండుట.)

చాంధూభట్టు — మహారాజా! జయ్ జయ్.

చ॥ శరమును నీవు కాండఁగొని చయ్యన దాల్చిన మూడులోకముల్
శరము భయంబు జెందగ నెదుర్కొన నెవ్వడు భూస్థలిన్ గ భీ
కరముఖమందు జ్వానల శిఖాపరికాంతికి బర్వభీమునిన్
దురమున విందుయుక్తముగ దునింపగ నీకెతగుజ్జ పురందరా

ప్రతా — (అసూయచూపును.)

చాంధూ —

సీ॥ అమితాస్త్రశస్త్ర ప్రతాపశాలియైన
పృథ్వీశుఁడీవంశ కధిపతుండు
కరమునాల్గింటను బరపెడి వీరుఁడో
గంభీర శూరుఁడు కరుణరాజు
అజ్మీరు రాజ్యమంతయుఁ బాడుఁజేసిన
వీరవంతుఁడు పృథ్వీ వరరాజు
ఖలశిక్షయుక్త సాధు కరుణయు జూపెడి
చోహానవంశమే సోమతనయ

తే॥ సోమదేవుని జంపిన భీమదేవు
సమరమునను జయించెడి శక్తినీది,

సంగరంబున నీయోధ సమితి వాడగ,
చోహ్నవంశంబు కీర్తియు చూడ్కులలర=

ప్రితా—(మరింతయసూయ భావము జూపును)

కరుణ—(క్రోధముతో) ఓరీ; చాళుక్యవంశాధమా? మా చోహానవంశకీర్తివినుటకు నీకిష్టములేదా? ఇపుడే యమ సదనంబునకుంబంపెద. (అని కత్తినిఝుళిపించును)

ప్రితా—నీతో నాకేమి? పో;

కరుణ—ఏమనుచుంటివి?

ప్రితా—నీడాంబికంబునకు వెఱచువారెవ్వరులేరు.

కరు—భయములేదా?

ప్రితా—భయమేలా?

కరుణ—ముమ్మాటికి చుట్టమై చూడవచ్చి, దయ్యమైపట్టినట్లున్నది. ఇపుడే కనుగొనెద.

ప్రితా—నీవుచేయునదేమియో చేయుము.

కరుణ—యమసన్నిధానమునకంపెద. (రోషమున)

తే॥ వచ్చుచుండెను నీమీదకు భుజగమంబు
శంభు న్నోచక్రితతినోను శారదంబు
నోను? యిచ్చవచ్చినవాని నీవుతలచు
కొమ్ము? కడతేరబోవుచుం టిమ్మహినిని॥
(ప్రితాపునిమీద దుమికిచంపును)

అరిసింగు—(రోషముతో) ఓరీ! విశ్వాసఘాతకా; నేనుండ నీప్రాణంబులు దక్కుట సున్నయనుకొమ్ము?

కరుణ——ఓరీ; నిన్నును నీసహోదరునితో సమానునిగాఁ జేసెద. కాచుకొమ్ము.

అరిసిం——నాసహోదరునితో సమానునిగ జేయుటసున్న, కాని నీపితరులు నీకొఱకు వేచియుండిరి. ఇప్పుడే పంపెద

తే॥ బలము గలవాఁడ ననియును బరగ నేల
నేద? మాతము నీరణ మింపులలర;
శాంతుఁడా; పరితాపు గడపి జయముఁ బొందిన
నంతమాత్రము శూరుఁడ నంగదగునె॥

కరుణ——అవునవును.

తే॥ అతఁడు శాంతమూర్తియయిన యగుఁగాక
నతని కంటె నత్యంత ఘాతరుఁడౌదు
నీబలం బేది, మాపుమా? నీచ, పాపి,
రమ్ము? రణకోవిదుఁడవుగమ్ము? రణరసింగ॥

అరిసిం——స్వామిద్రోహీ, నిన్నిపుడే యమపురిదారిఁ బట్టెదవు.

కరుణ——నీచా? కడతేఱితివి? (అరిసింగును చంపును)

(ఆవనిక పడును. కరుణరాజు పృథ్వీరాజు నిష్క్రమించెదరు)

గోకులదాస్——(విచారముతో) తమ్ములారా? ఎంతపాటిల్లె మనకు, అమరసింహుఁడిటే వచ్చుచున్నవాఁడు.

అమర——(ప్రవేశించును.) గోకులదాస్ క్షేమమా?

గోకు——క్షేమమే?

అమర——గోకులదాస్; అన్నలిద్దరు మరణించిరా? ఎంతటిదారుణవార్త? యీసంగతిని, మిమ్ములఁదీసుకొని నమ్మని నన్నంపె, వచ్చెదరా?

2 వ—ఎందులకు? ఇప్పటికిద్దరు హతులయిరి. తక్కినవారి నక్కఱనా?

అమర—అల్లించవద్దు.

3 వ—భీమునిసంగతి మాకు తెలుసును.

అమర—ఆయనయిప్పుడు చాలవిచారములో నున్నాడు.

గోకు—మమ్ముల తుదముట్టింప లేదనియా?

అమర—లేదు. లేదు. మిమ్ముల పారదోలినందులకు మమ్ముల రమ్మని గోరుచున్నాడు.

గోకు—పృథ్వీరాజు రాజ్యమెంతవరకుండునో, యడిదాటి రాము.

అమర—గోకులదాస్, పిచ్చియభిప్రాయమేల జెందెదవు. పవిత్రమైన చాళుక్యవంశమున బుట్టి నేడు పరరాజుల సేవించుట మంచిదికాదు. ఇందులో చాళుక్యవైరులగు చోహాన వంశస్థులనే సేవించుట మీయన్నకు తలవంపు. మిమ్ములను దరిమి వేసినందులకు నతడు పశ్చాత్తాపము జెందినాడు. ప్రతాపాదులు కరుణరాజుచే, సిద్ధిరసు విని యెంతవిలపించెను! ఇంతకంటె వేరె యవమానమెందైన నుగలదా? మీరు భీమరాజు పక్ష మవలంబింపుడు. పృథ్వీరాజుకు భీమరాజుకు రానున్న యుద్ధములో భీమునకు దోడ్పడి, మీ మన వలన సంస్థానమును, గౌరవమును సంపాదించు కొనవచ్చును. రాజ్యముమీకిప్పించెద. మీరు భీముని మనసు యెటువంటిదో కనుగొని మరి చేరుడు.

గోకు—అగ్నికి చల్లదనమబ్బినట్లు, భీమునుంచి చల్లనిమాటలు వచ్చుటయెంత యాశ్చర్యము. అమరసింహా యట్లే వచ్చెదము, నేనే వచ్చెద, నన్నుచంపకుగదా?

అమర—నీప్రాణమునకు నాప్రాణమిచ్చెద. పయనముగండు. మీరలు యిక్కడివార్తలు నాకుఁదెల్పుచుండవలయును.

నిష్క్రమించెదరు.

(అవనికపడును.)

---

2వ రంగము.

ఇచ్ఛినీ యంతఃపురము.

(ఇద్దరుకావలివారు ఫారాయిచ్చెదరు)

1వ—(తూలుతు) బలే నిషాగావుంది.

2వ—(నవ్వుతూ) అరే, మామా? నాకుఘమ్మత్తుకైలాసంకినబడుతుంది.

1వ—(వాళ్ళకు దీనిలోమజా, తెలియక మంచిదికాదంటారు.

2వ—ఆళ్ళకేమితెలుసు, "సురా" దానిపేరు.

1వ—ఒరే మంచిమంచిసర్దారు మువాలు! నాకు

2వ—నాకురాజ్యం చేయాల!

1వ—నాకుగలంతుపుచేస్తే గోలయవుతాది. నీకుసర్దారుపని యిప్పించుతా

2వ—నాకునీవెవరోయి, రాజునాకు. (తూలుపడును)

1వ—(నవ్వి) బలే, బలే, !

ఈశ్వరి—ప్రాపప్రభాతము యెంతమనోహరముగ నుండెను.

ఉ॥ తెలతెలవారె నింకనిను తేజము పూర్వముఁ జూడనయ్యె? నా
వెలవెలవారుచుండె, గన నయ్యెను జాబిల్లి పశ్చిమంబునన్
కలకలమంచు బక్షితతి గానమొనర్చెడు నిద్రలెండు; మే
కలు జనులార! యంచు నను రాకను దెల్పెడి నీప్రభాతమున్॥

ఆహా! ఆతూర్పుదూత!

చ॥ చలచలతారకావళిని జాటిఁజెలంగ వినోదహాస్యమున్,
యిలరమణీయతన్ నిమిషకాలములోనసె, కోటిమార్పులన్
జెలగుచు నేత్రపర్వముగ జొన్పడు బాలుఁడు తూర్పుదూతయై
కలవడి నేగుదెంచెడి జగంబున జాటెడు ఘూర్ణయోయనన్॥

1వ 2వ—అయ్యా! దండాలు, దండాలు.

ఈశ్వ—ఇచ్ఛనీకుమారి లేవలేదా?

1వ— లేదు. లేదు.

ఈశ్వ—ఓసి, దాసీ, నీవులోనికిఁబోయి లేపుము. గురువుగారు వచ్చిరని దెల్పుము.

దాసి—(లోనికేగి) మహారాజ! ఇచ్ఛ యిచ్చట లేదు. యంతఃపురంబంతయు వెదకితి. గానరాలేదు, రూపవతి లేదు.

ఈశ్వ—(కూలబడి) హా! ఇచ్ఛనీ, ఎందుబోతివి? ఎక్కడ దాగియుంటివి. న్నేసీగురువును కాదా?

సీ॥ శరములారింటెని జంకులేకయు బర
పెడి వీరవతివైతి విశ్వమందు
కాండముల్లైదును కాయము లోనికి
జొప్పించు శక్తియుఁ జూచితిలను
షోడశపరిపూర్ణ శీలవతి వనియు
గొనియాడుదారె ధరణిన్ గోమలాంగి

విల్లును చేతిని దాల్చిన నెవ్వఁడె
మరోక్కందు రీధర తూపులకును

తే॥ అబల! సోయగంబులమిన్న యంబ, దేవి,
నాదుముదిపెంపు, కూతురు నగముదాణి,
ముద్దుగుమ్మ, నీబంగరు మోముఁజూచు
భాగ్యమేను గాంచగలేను పద్మనయన.

ఇచ్ఛినీ, నీవిల్లుపిడిపోదువనియెన్నఁడెఱుంగ, నాచదువంతయు
నీకు నేర్పుచుంటినిగదా!

॥సీ కాంచనుగాంచోలు కాంచన బొమ్మను
చారుదళభ్రుకుటీ చంద్రవతిని
కాంచనుగాంచోలుకరముల నెన్నడు,
నవకాంతి జెలగెడి నవ్యకొమ్మ
జూచనుగాంచోలు చూడ్కులింకను చెలి
ముఖచంద్రుబోలెడి మోముకాంతి
వినఁగాబోలును వీనుల విందుగా
వ్యాక్సుధామృతమవు పలుకులెల్ల

తే॥ పలుకుల యువతి, బలుమఱుఁ బలుకరించు
భాగ్య మేనుగాంచగనైతి జగతియందు!
ఇచ్ఛినీ? చాన? సుకుమారి? యింకనిన్ను
గననుగాంచోలు నిలనేను కలలోనైన

చైతప—(ప్రవేశించును.) సామంతరాజు లందరికి బోత్రా
హాపరచి వచ్చితి, వారు వచ్చెదరు, వారికి దగినపరికర
ములు కూర్పవలయు. (తెరలో).

ఓ రాజశేఖామణీ! పవిత్రవంశంబైన హిందూ మతమునకు వన్నె దెచ్చినరాజా? నీదు కుమారి గాన్పించనందున, యీశ్వర భట్టుమున్నగు వారు మహార్ణవములో మునిగియున్నారు.

జైత్రప—ఎవ్వరిదీ వాక్యము. (నలుమూలలచూచి) పిసుకుఖాకాంతులయిరి. (సమీపించి) గురువరా? యిదేమి?

యీశ్వర—ఇచ్చనీ లేదు?

జైత—(నలుమూలలవెదకి) హా! యిచ్చనీ, కూతురా?

సీ॥ ఈమేడనేగాన నామేడనింకగాన
దగుమేడబోదునా తల్లినరయ
ఈఛాయలేదాయె యేఛాయకేబోదు
దగుమేడబోదునా తల్లినరయ
ఈమూలలేదాయె యేమూలకైయింక
జని వెదకెదనేను జననినరయ
ఈవంకలేదాయె యేబోదునేమీదు
దయరాదు వేల్పుల్క దల్లినరయ

తే॥ తల్లి? యెందువెదకెదనీ ధరణినేడు,
గానరాదు, నాతల్లియుం గనుటకేను,
తల్లిలేనిదానవయును దండ్రిగూడ
లేనిదానవైతివినీవు లేడినయన?

నాయనుజ్ఞ పొందనిది నెక్కడకువెళ్లవు. ఇంక నాకు జీవనమెక్కడ, రాజ్యమెందుకు, సంపదెందుకు. హా? (మూర్ఛిల్లును.)

ఈశ్వ—రాజా? విచారించినలాభమేమి? అంతఃపురరక్షకుల

బిలచియడగినచో, తెలియగలదు.

జైత—ఎవ్వఁడవ్వరాయక్కడ?

బంటోౢ—మహాప్రభూ? ఏమిసెలవు?

జైత—ఇచ్ఛినీకుమారిఏది?

బంటోౢ—మహాప్రభూ? నిన్నరాత్రి జామున్నర పొద్దుపో యిన తరువాత రూపవతి సవారిలోనికిఁ వెచ్చెను. నేనడ్డ గించితిని. అంత ఇచ్ఛినీ యచలేశ్వర దర్శనార్థమేగునని చెప్పెను. లోనిక్కేగి, తిరిగి, ఇచ్ఛినియు, రూపవతియు, అభయసింహుఁడు వెళ్ళిరి.

జైత—అర్చకుని తీసికొనిరమ్ము!

అర్చకు—నమస్కారము. మహారాజా?

జైత—ఇచ్ఛినీ విషయమేమైనఁ దెలుసునా?

అర్చ—ఈరాత్రి రాకుమారి స్వామిదర్శనార్థమొచ్చుచుగాన, నన్ను వేచియుండమనిరి. రాత్రి రెండవయామమున, రాకు మారి యాలయమునకువచ్చెను. రూపవతియు, అభయ సింహుఁడును నుండిరి. ఆమె స్వామినిదర్శించి, ప్రసాదము స్వీకరించి యింటికి మరలెను. నాకుఁదెలిసినసంగతిదియే!

జైత—(ఆలోచించు) రాజులారా? మంత్రులారా? మాఇ చ్ఛినీ ధూర్తురాలుగాదు. గుణవతి. ఆమె తనంతనిల్లువి డచుట కంగీకరింపదు. ఇచ్ఛినీయు, రూపవతియు, యభ యసింహుఁడు, తిరిగివచ్చునప్పుడు, యీఘోరము జరిగి యుండును. ఇచ్ఛినీజాడలు నరయుటకిదే మీాకనుజ్ఞనిచ్చితి.

(నిష్క్రమించెదరు.) (అవనికపడును.)

3వ రంగము.

(ఘూర్జరారణ్యమున నొక బాటసారి ప్రవేశించుట.)

బాటసారి — ఈయుత్తరము యాభీమునకిచ్చి యాయనయనుగ్రహంబు బడసెద. స్వామికార్యముచేసి, సంతోషవార్త జెప్పిన, నాకేమితక్కువ. ఇక్కడనుండి, నక్కడకుం బోవుటకు చాలకాలముపట్టును. అయిన త్వరగాంబోయెదను. (నడచును.)

2వ బాటసారి. —(ప్రవేశించి) ఇతని మాటలంబట్టిచూడ, యేదియోయొక రహస్యపు వుత్తరము తీసికొని వెళ్లుచున్నట్లు గాన్పించుచున్నాండు. అది తప్పక, ఇచ్చినది గూర్చిన విషయము. భీమునకుం దెల్పుటుత్తరము గాంబోలు. తిరిగి తిరిగి ప్రాణములిసిగెను. కాని యింతనకెందుండెనో తెలియుదామె. వీనితో స్నేహముచేసెద. (సమీపించును.) ఓయీ? నీవెక్కడకుం బోవుచుంటివి.?

1వ వాడు — నేనా? చాలాదూరము.

2వ వాడు — నేనుగూడ చాలదూరకువచ్చెదను.

1వ వాడు — ఎంతద్దూరము?

2వ వాడు — వల్లభీపురమునకు.

1వ వాడు — నేను వచ్చెదను. (తెరచుట్టివచ్చెదరు.)

2వ వాడు — ఎంతదూరము నడచితిమి.

1వ వాడు — మిత్రమా? యీవుత్తరములోని సంగతులేమి. (యిచ్చును.)

2వ వాఁడు—(పుచ్చుకొని) మిత్రమా? పృథ్వీరాజు భీముని మీఁద దండెత్తెనని, (తిరిగి యిచ్చుచు.) చాలనడచితిమి?

మ॥ ధరరాజన్యుల నిగ్రహించుటకుగా దండెత్తెనామర్త్యభీ
కరుఁడే భీమముఖాసురుండితని కంగారుప్రతాపంబునే
జగఖ్యాతుఁడనింకనోర్తునె వృథా స్వారత్వమీకేలనఁ
న్కరణిన్ భాస్కరుమందకాంతియగుచుం గాన్పించె నాకసమున్॥

1వ—ఈ రేయి ప్రయాణముచేసిన చాలదగ్గఱకుఁ జేరుదుము.

2వ—మిత్రమా? ప్రొద్దుగూకుటచే, గమ్యస్థానము చేరలేమని

1వ—నేనుమాత్రము వెళ్ళెదను.

2వ—బ్రతికిన బలుసాకైనతిని బ్రతుకనచ్చు. నీకుఁ బ్రాణంబులపై నాసయుండెనేని, నేనొకయుపాయంబుఁ జెప్పెద. ఒప్పుకొందువా?

1వ—మంచిదైన నొప్పుకొందును.

2వ—సమీపములో నొక్కపల్లెగలదు. అందు నాస్నేహితుఁడొకఁడుగలఁడు. ఈ రేయి వానియింట భుజించి, రేపు పోదము. మనమీ రేయి ప్రయాణముచేసిన, యేపులి వాతనోబడి చావవలసిన వారమగుదుము.

1వ—అట్లే పోవుదము.

(ఇద్దరుకలసి స్నేహితుని యింటికేగుదురు.)

స్నేహితుఁడు—(ప్రవేశించి) మిత్రమా! యెక్కడనుంచి నీ రాక?

2వ వాఁడు—ఇక్కడనుంచియే. ఈయన నా మిత్రుఁడు. చీకటి పడుటచే, యీ రేయి యిక్కడయుండనచ్చునని వచ్చితిమి

స్నేహి—మంచిది. ఇక్కడపరుండుము. (యిద్దరుపరుండెదరు

2వ వాడు—(లేచి స్నేహితునితో) మిత్రమా! ఇతడాశ్రితు కోటిలోనివాడు. నాకుఁ గావలసినయుత్తరము నీనిదగ్గఱ దొరకెను. నీవు వీనిని బంధించవలయును, (మూటలోని చీటివిప్పును.) (నిష్క్రమించెదరు.)

(అవనికపడును.)

---

4వ రంగము.

(భీముఁడు ఒంటరిగ గూర్చుండును.)

భీము—(ఆలోచించి) హా? మదనా? నీకింత క్రౌర్యం బేల? నీ కుసుమబాణంబులన్నియు నాయందే గనపఱచవలయునా? ఆకోమలాంగిని, నీయత్ర్యనైపుణ్యముచే, నన్ను వరించునట్లు చేయుము. ఆమె ధనుర్విద్యయందు గూడ మంచి నేర్పరనియేవింటిని. ఆయువతి యెప్పుడునాకంట బడునోగదా?

అమర—(గోకులదాసుతో ప్రవేశించి) మహారాజానమస్కారములు.

భీము—అమరసింహా? క్షేమమేకదా?

అమర—క్షేమమే?

భీము—గోకులదాస్, తక్కినవారెక్కడ? మాతండ్రియగు సారంగదేవుఁడెంత యన్యాయముగ ప్రవర్తించుటచే, మాకింత కష్టముప్రెడమె? నారాజ్యమంతయుకొల్లరిజేసియు య్యనియటుంచి

## ఇచ్ఛినీకుమారి.

సీ॥ పట్టణంబనరాదు పల్లె యనగరాదు
నట్టెపుట్టడిడచి నణగజేయు
సిరిమేటి యనరాదు సింగంబుసాటియా
గిరికుమారినియైన గెలచివచ్చు
దేయాదులనరాదు తనవారనగరాదు
చోరవాంఛితశరములు చూపుచుండు
పుడమిఱేడనరాదు బుధాత్ముడనరాదు
దాడిగెడలి వారి దర్పమడచు

తే॥ పోలతి, బాలింతయనరాదు కాలధరుడు
భీతినొందక బల్మిని బెనగికలియు,
నాత్మసామ్యులలటజూచిన నంతనేగి,
దుడుకుతనజొచ్చి కొనితెచ్చు దుష్టుడతడు॥

తాంజేయుచున్న ఘోరములకు పశ్చాత్తాపముం జెందుటకు మారుగా మరింతఎక్కువయ్యె? గ్రామాదుల కొల్లకొట్టియు, నాకు స్వస్థతకలుగనీయక, బ్రవర్తించెను. మానవులు పలు కష్టము లనుభవించినగాని మంచిమార్గములోనికి రారని, మమ్ముల దరిమితి, కాని మహాభినివేశముగల తనపట్టును యావజ్జీవము విడువడయ్యె? పితాపాదులుమరణించిరనివిని, మిమ్ము లంజేపట్టుపలయుననిం దలంచితి. వేరాలోచనలేక యిక్కడనే యుండను.

సీ॥ జననమునొందిరి చాళుక్యవంశమున్న
గడియుంచిరి ధరణీ ఖ్యాతిమీరు

బోడమిరఁ భీమునకుఁ బుడమిఁబడమ్ములై
సారంగదేవునిఁ గుత్తలాచు
గెలచితిరిజగమ్ముఁ గెలిసలుపుచు రా
జన్యచూడామణుల్ జయముఁబొంది
గగనరాజ్యంబంత ఖడ్గంబునఁ బోరిఁ
నాత్రోటిజగడంబు నొందెవీరు

తే॥ వీరులై చెలఁగుచునుండ రెరె? శూరు
లంచు, మిమ్ముల వేనోళ్ళ నుచ్చరింప;
పావనజలమ్మునందుఁ బరగుబుద్ధి
చందమైతిరె చోహాన జాతిఁ జేరి.

సోదరా? మీరు సుఖముగా కాలముగడుపుకొనవచ్చును. రాజ్యవ్యవహారమంతయు మీరే చూడవలయును

గోకుల—సోదరా? మాకుమాత్రము మన్యాపి సంశ్రయించి యుంటుటమాత్రము యిష్టమున్నదని కదా? నీవలదన్న వెళ్ళితిమి? మేమే కావలయునంటివేని యట్లేయుండెదము.

(నిష్క్రమించుచు)

భీము—అమరసింహా! పోయినపీడను తిరిగనెత్తిమీదఁబెట్టుచుంటివి "జ్ఞాతిచ్ఛేద కింతోపహర్త" యనెడి నార్యోక్తి నీ వెరుంగవే?

అమర—అట్లనవద్దు. వీరిలో బలాఢ్యులగు ప్రతాపాదులు చనిపోయిరి. వీరివలన, యచ్చటిసంగతులు తెలుసుకొని, సమయము దొరకినప్పుడు, పృథ్వీరాజును తుద ముట్టింప వచ్చును.

భీము—మంచి యుక్తిఁబన్నితిరి.

అమర—మీరేల మధుమంతమునకు రాలేదు!

భీము—ఎందులకు?

అమర—మీదగ్గఱకు మధుమంతుఁడు రాలేదా?

భీము—రాలేదు?

అమర—ఇచ్ఛినీ విషయమై, యొకజాబువ్రాసి, వానిచేత నీకుబంపితి.

భీము—శత్రువుల చేతఁజిక్కెనా?

అమ—చిక్కనిచో నెందులకురాఁడు? నీవిప్పుడు తడయుట మేలుగాదు. ఇచ్ఛినీని మధుమంతమునకు జేర్చితి. యామె కొఱకు దేశదేశములు తిరుగుచుండిరి. మనసైన్యములతో, మధుమంతనయుండవలయును, లేనిచో ముప్పువాటిల్లును. గోకులదాసుని చంపనని, శాబ్దిచేయుము.

భీము— చంపుదునసియా? వినుము.

సీ॥ బలిరిపులనిముసం బులలొ గెడపినయా
వాసుదేవునియొక్క పాదమాన
వేలుపులదఁశిసి వెలయించినమహాను
భావుఁడగు శివుని పాదమాన
అన్నింటికితిండికా డౌయనలుండన
జంటమోములసామి సాహ్యయాన
అర్ధేందుని బిలుక మార్చినయిందిరా
చాముణ్డాయణేశ్వరి తల్లియాన

తే॥ జననమరణము కలిగించు శక్తికలిగి
వేణువీణాస్వరముగొల్పు విద్యరాలు,
శారదాంబనుజూచియు సంతసించు,
వేదకారకుడా విశ్వ వేదయాన॥

అమ—ఇప్పటికి నమ్మకముఁబొడమె. పయనముగంత.
(నిష్క్రమించెదరు)
(అవనిక పడును.)

---

5వ రంగము.

మధుమంతమున మేలుకొలుపులు. తెరలోను.
(ఇచ్చినీయు రూపవతియు పరుండెదరు)

సీ॥ మేటిసైనారాసి దాటిచోరునిజేసి
మేటిచారువిహార మేలుకొనుము.
కోటిరాజులలోను గోరగసోమనాద్
మేదినిరక్షింద్రా మేలుకొనుము.
నారివైసంభృతి న్నాణమ్మైరిపులను
మేలుగొల్పినశూర మేలుకొనుము.
హితులమాటలబట్టి యిచ్చినిన్ దెచ్చియు
మెరసిన భీముఁడా మేలుకొనుము
తే॥ లీలజగువు లీలధరుఁడ మేలుకొనుము
కాలధరుఁడ వీవురహిని మేలుకొనుము
మేధ్ని పేరుగాంచినధీర మేలుకొనుము
నీలనీలాంబుదసుశాలి మేలుకొనుము॥

ఇచ్ఛ—(ఉలికిపడిలేచి) రూపవతీ! రూపవతి, యీభవన మెవరిదై యుండును. మనమిప్పుడు యెచ్చటనుంటిమి?

రూప—(కన్నులునులుపుకొనుచు) ఏమమ్మా? పలవరించుచుంటివి. రాహుగ్రస్తుఁడయినాఁడా రవి?

ఇచ్ఛ—రాహుగ్రస్తుఁడు కాదు, మోకములవక్త్రంబులనెడి గహ్వరంబుల చేరువనుంటిమి.

రూప—ఎవరమ్మా?

ఇచ్ఛ—నిద్దుర లేవేమిద్దమ్మా? ఈపురంబెవ్వరిదో చెప్పుము. నేనెప్పుడు చూచియుండలేదు.

రూప—భవన మేమిటి?

ఇచ్ఛ—మందమతీ? కన్నుతెరువుము. ఈమేడయందు మన మెన్నఁడైన తిరిగితిమా? నీవీభవనమును చూచితివా?

రూప—చూడ కేమి? మనభవనము కాదా? నీ వెరుగనట్లు మాట్లాడుచుంటివి. భయముజెందకు? పరుండుము.

ఇచ్ఛ—(వీపుమీఁదచరచి) తిన్నగాచూచి నీమేడనెవ్వరిదో చెప్పుము.

రూప—(తేరిచూచి) ఇదిమొకశత్రురాజులది.

ఇచ్ఛ—ప్రమాదము. ప్రమాదము, రక్షణమెట్లు?

రూప—రక్షణ. భీముఁడే! విను.

సీ॥ మూఁడులోకంబు లేలెడిశౌర్యోదితో
జ్వలకీర్తి భీముఁడా చక్రవర్తి
సర్వలోకసురాజ్య సర్వమేలెడి నిరం
జనమూర్తి భీముఁడా చక్రవర్తి

విశ్వదేవార్చన రక్షణదీక్షితు
శతపూర్తిభీముఁడా చక్రవర్తి
నరలోకమంతయు నణఁగద్రొక్కి నపాపి
చండాలుభీముఁడా చక్రవర్తి
తే॥ మహామహుల నందరిభువి మట్టగించి
సాహసగాంభీర్యబలుఁడయొ చక్రవర్తి
జైనమతమవలంభించు జిన్నవాఁడు
భవనమిది సోయగంబులొప్ప పద్మనయన

ఇచ్చి—(కూలబడి) హా! ఈశ్వర; మమ్ముల యొక్క బెబ్బలి గంహ్వరంబున కల్పించితివా! రాహు గంహ్వరంబున బడినచంద్రునిమాడ్కి నన్ను భీముని గంహ్వారంబునుండి రక్షించువారెవ్వరు. హా! రక్షణ! ఇంకెక్కడి రక్షణ

చ॥ తగవును ధర్మమేదినిని దానవునంతటి వాఁడు దిక్కులే
కగుపడి చేతఁజిక్కెనని యంబుజగర్భుఁడు వ్రాసి యుండగా
జగడముసేయనెంచ రణసాహసబాణము గల్గినన్ రహిన్
వగతునె, శక్తియు లేదె; చపలపాములబోలుగతిం జరించనే

రూపవతీ; యీభవనంబునుండి తప్పించుభారంబు నీయది.

రూప—చేతనైనంతవరకు చేసెద. అతఁడు సామాన్యుఁడు కాఁడు. విను చెప్పెద.

మ॥ మునుమీ భీముని చేతఁగాదె గరుడున్ ముక్తిందు సౌభద్రుఁడున్
కనకాక్షంతుఁడు చంద్రవంతుఁడు సనాకాద్యుసుమంత్రియనన్
గన గాలంధరు కాలనేమి కనకాంగాజానుడున్ ఘాముఁడున్
చనె నాతీరున నాతఁడెల్ల యొడలం జంపెన్‌గదా రాజులన్

అమ్మా? ఆమహారాజును గోరిన నీకేమిత్రెక్కెన. నీవలచుటక్కు నాఁడుగా, యారాజే నిన్నువలసె. వలదనువారుఁగలరె?

ఇచ్ఛి—ఇసిరో? ఇదంతయు నెందులకు, మనమీ దుర్గమున నుండి తప్పించుమార్గము చూడుము.

రూప—అమ్మా! నేనరగి యిందుజాడలన్నియు నరసివచ్చెద.

(నిష్క్రమించును.)

ఇచ్ఛి—హా! జనకా నీవు నాకొరకెంత గుందుచుంటివో? దుష్టుండగుయీ భీముండెంతపనిచేసె, నిన్నబంధుజనులతో హంసతూలికా తల్పంబునయుండ, నేడు బంధుహీనురాలనై, యన్యగృహాంతర వాసినై, యుండవలసివచ్చె. హా! తండ్రి, నిన్నెప్పుడు జూచెద.

సీ॥ కాంచెదో, కాంచనో, కరుణతో బ్రోచెడి
నాదుగురువునేడు గుందుచుండ
కాంచెదో; కాంచనో, కలిమిలేములు నిచ్చు
నాప్రాణదాయకా నాదునాథు
కాంచెదో; కాంచనో, గడుగారాబంబుగ
జూచునా పౌన్నారి పసిడితమ్ము
గాంచెదో; కాంచనో, గడుబ్రేమమునుగ యుండు
యభయసింహుని నిఁక నరయలేను

తే॥ నిముసమేనియు ననుజూడ పిలువలేని
నాజనకుడెంత గుందుచు నన్నుగాన్క
దేశదేశములదిరుగ్మ రుచును యుండె!
అకట! నిఁకగాంచలేనెందు నాదుతండ్రి.

దాసి—(ప్రవేశించి)హా? మాయావియగురూపవతి, మాయోపాయంబున, యీసుకుమారి కన్నెను బలవంతముగా

దాంగిలించుకొనివచ్చె. ఆమె శోకభారమునకు మేరయే లేదు. నిప్పుడే శాంతింపజేసెద. (ప్రకాశముగ) అమ్మా! వగచిన లాభమేమి? దీన దయాపరుండగు యప్పరమేశ్వరుండు నన్ను నీకడకుం బంపె.

ఇచ్ఛ—రూపవతీ! ఏమైన యుపాయంబుల వెదకి వచ్చితివా?

దాసి—అమ్మా! నేను రూపవతినిగాను, నీకు బాల్యదాన మొనర్ప బూనుకొనిన యొకదాసిని.

ఇచ్ఛ—ఇచ్చటి దాసివా? హా, జనకా?

సీ॥ చెలువుల కలినేలు చెలువునివదనంబు
గాంచనుగాంబోలు కలను నేను
శ్రీమించు రహిమించు సిరిమేటియాధర
వర కుమారుని గాంచ వలను లేదె?
సిరికుమారుని నిష్ఠు సింగిణివిల్లును
కోదమ తేటిని గాంచ గోర్కెలుండె?
చంద్రగోళములోని చంద్రికిరణుంబోలు
నీరూపరేఖనే నెందుగాంతు

తే॥ పిన్నతనమున నుండియు బన్ను చుంటి
గాంతుంగాంచుటకు దనువు గదలుచుండె?
నన్ను నొంటిపాటునుజేయ న్యాయమేన
నాథ; పృథ్వీశ, మహితేడ నాదునాథ॥

దాసి—అమ్మా! వగలంబొగిలిన లాభమేమి? దివాకరుండు సైతము, నీఘోష వినలేక ఉదయాద్రిమరుగున నుం బోవు

చుండెను. ఇయ్యది, భీమునిభవనము. నిన్ను రూపవతి మోసపుచ్చి, యిచ్చటకుం దెచ్చె.

ఇచ్ఛ — హా, నాథ? హా సోదరా, హా జనకా, మీకు నాకు ఋణంబుంజెల్లె. మిమ్ములంజూచు భాగ్యంబేనునోచనింక. ఓరీ విశ్వాసఘాతకా? నావంటి యబలల చెరబెట్టి నీవేమిసుఖం చెదవో చూచెద, ఓరీ? కులద్రోహి, నిన్ను జంపుటకు హిందూమతమున శూరులు లేరని తలంచితివి. రావణుండే మయ్యెనో, నీవునంతియే? నాడు బానినగు నాయుసురు నీకుందగలకపోవునా? నీవే శూరుండవైనచో, నాచేతికొక బాణమిచ్చి, నన్ను గెల్వుము. మాయోపాయంబున, నన్నుం దెచ్చుటదగునే? అభయసింహా? నా కొఱకెంత యిక్క టులం బొందుచుంటివో? ఓరీ, భీమా, యిదినీకు మగ తనంబుగాదు. పౌరుషంబుగలవాండవైనచో, రిమ్ము రణ మునకు. హా, జనకా. తండ్రి. (మూర్ఛిల్లును)

(అవనికపడును.)



# ఇచ్ఛనీకుమారి.

చతుర్థాంకము.

1 వ రంగము.

(ఇచ్ఛనీ వకుళయు ప్రవేశించెదరు.)

ఇచ్ఛ—చెలి! భీముండింత క్రూరుడని యెఱుంగ. సిరిసంపద లెంతయుండిన నేమి? పేరు ప్రతిష్ఠలుండవలయును.

వకుళ—అంతడు లోకకంటకుడు. భీముఁడు చేసిన హత్యలు యిన్ని యనియా? తొల్లి రావణుండు. ఇప్పుడు భీముఁడు. అదిగో, రూపవతి, టక్కుచు, తారుచు, వయ్యారముతో, మహోపకారము జేయఁబూనిన, చేడియవలె, నిటే వచ్చుచున్నది.

రూప—(ప్రవేశించుచు.) అమ్మా! నమస్కారము.

ఇచ్ఛ—(కండ్లెఱ్ఱజేసి) ఛీ! పాపాత్మురాల! నీముఖముఁజూచిన పంచపాపములు జుట్టుకొనును. నాయెదుటనుండి త్వరగా లేచిపొమ్ము?

రూప—తల్లీ! నేనేమి చేసితిని.

ఇచ్ఛ—పాపి; అప్పటి ప్రసంగములవలన భీముని పరిచారిక రాలవేమో యని, యనుమానముఁబొందెడి దానను. వెంటనే నీకపటవచనంబులకు మోహితనై, యాయను మానంబు దొలగించుచుండెడిదానను. అంతియేగాని నిపు

నాకు మహోపకారము జేయబూనిన కాలసర్పమని యెఱుంగ. ఓకృతఘ్నురాల, యింతకాలము నాయన్నము దిని, నాబట్టకట్టి తుదకుఁ జేసెడియుపకారమిదియా? నిన్ను గోసి కాకులకు వైచినఁ బాపముండునే?

రూప—(నవ్వుచు) రాకుమారీ, నేను నీకపకార మేమియు జేయ లేదు. చక్రవర్తియనందగిన యొకమహాచక్రవర్తికి నిన్ను కూర్చి నందుకు సంతోషించుటకు బదులుగా, నన్నిట్లు నిందించుట న్యాయమా? విచార మొందులకు సుఖముగా యుండుము.

ఇచ్ఛా—ఓసీ! నీవా నాకువివాహము జేయుట. నీకీయధికార మిచ్చిన వారెవ్వరు. ఇఁక మీదట యీవిషయము నా యెదుట మాట్లాడినచో బ్రాణములుండవ నుకొమ్ము.

రూప—మంచిదమ్మ, మంచిది. నీకీయాగ్రహ మేల! నీ మేలు నీకు తెలియుదామె. ఎవ్వరికర్మము నెవ్వరు దప్పింపగలరు నియిష్టము. (నిష్క్రమించును.)

ఇచ్ఛా—ఇంతమోసగత్తెయని నెఱుగనైతి. భూలోకంబు నెంతటి వారలుండిరి.

వసు—రూపవతి సామాన్యురాలని యెంచితివి.

ఇచ్ఛా—అట్లెంచియే, మోసపోతిని.

(తెరలో, కీర్తన)

నాదనామక్రియ ఆట

మాయకాయము నమ్మనేల - మాయవాళ్లతోటి మసలనేల
మాయవస్త్రము కట్టనేల-యయ్యో! మాయలోబడికాలగనేల॥మా॥

పరకన్యలగోరగనేల - పరద్రవ్యములపై భ్రాంతిపడగనేల
దొంగతనము జూపగనేల - ఏన్నతరముగాని నరుల దండింపగనేల॥మా॥

వట్టిమాటలేటికి నాతో - బూటకంబులు నమ్మనేల
కూటిదెయ్యంబనగరాద - పొట్టకూటికై పరకాతుగుడువనేల
తేటపడగరాద మమ్మాటికి - దెల్పిన నాటగలేద॥మా॥

తల్లి దండ్రులు యాలుబిడ్డలు వెంటరారు - కాలుచెయ్యలుడిగిరారు
చెల్లుకాలమునందు నీతో - గడతేరబోరు॥మా॥

భిక్షాన్, దేహి,

శ్లో॥ సమాతుం శక్యం మేనయన యుగమాశీకరతత్తై
స్తనుర్జ్యోత్స్నా చేయం విఘటయతి గాఢాంధతమసం
సఖీ నామహలాతిం రచయతిచ మేగంధనివహాః
రుదంతీనాంతాం మాతాహసిత వదనాచుంబతి ముఖః॥

అమ్మా; భిక్షాన్, దేహి, ఘూర్జరలక్ష్మికి సంతోషకర్నాయే;

దాసి—(ప్రవేశించి) ఎవరోయి; పో.

(తెర్వతో)

నే నొకబిచ్చగాడను

దాసి—అయితే, పో, బిచ్చములేదు, ధర్మములేదు.

(తెరలో) ఎక్కడకుంబోయెదను పెట్టువరకుంబోను.

దాసి—పోక, నీ సొమ్మేమైన దాచిపెట్టితివా?

(తెరలో) ధర్మముచేయక, కట్టుకొనిపోవుదువా?

దాసి—ఏమా మాటలు?

(తెరతో)

శ్లో॥ సమాతుంశక్యామే నయనయుగళీ కరతలై
స్తనుర్జ్యోత్స్నా చేయం విఘటియతి గాఢాంధ తమసం
సఖీ నామహాతారచయతిచ మేగంధనివహః
కరంతీ నాంతాంమాయహ సితవదనాచుంబతిముఖః॥

దాసి—ఓసీ! నీకేమైన పిచ్చియా?

ఇచ్ఛి—ఆవచ్చిన బిచ్చగానికి కొంచెముధర్మము పెట్టుటకు మారుగా యీరాద్ధాంతమేల? మీరాజు ధర్మముచేయు కుండ యుండుమనెనా? చాలు చాలు? (లేచిముందరకు బిచ్చగానివైపు నడచి) అయ్యా? తమరిదేవ్వారు! (తెరలో) ఏవ్వారయితేనేమి; వల్లకాటివ్వారు? బిచ్చము పెట్టుటకుమారుగా దిట్టించెదరా? కాశీకింబోవుచుంటిని. ధనవ్యయముగుటచే మిమ్ముల దర్శింపవచ్చితి.

ఇచ్ఛి—(తనలో) ఇతనిముఖ వైఖరిఁజూడ, ఈశ్వరిభట్టువలె యున్నాడు. లేనిమొడల నాచిన్నతనమున పఠించుశ్లోకము నీతఁడేలవచ్చును. నాకొరకెదుకుచు యీవేషము నవచ్చె. (ప్రకాశము) మీరీపూలహారముఁ గైకొని, కాశీకిబోవచ్చును. (యిచ్చును)

(తెరలో) జయం, జయం, మాత;

ఇచ్ఛి—(తనలో) నిజముగాయీశ్వరభట్టువలె నున్నాడు. ఇప్పుడితఁడేగి నాజనకునితోఁ గూడివచ్చి, నన్నుఁగొని పోవుదురు.

(నిష్క్రమింతురు.)

(అవనికపడును)

---

2వ రంగము.

(కైలాసశిఖరము మీఁద, ఇచ్ఛినీ, వకుళ ప్రవేశించెదరు)

ఇచ్ఛి—ఈశిఖర మెంతయానందము గొల్పుచుండెను?

వకుళ—వసంతకాలములో యీశిఖర సోయగంబుఁ జెప్ప నలవియా?

ఇచ్ఛి—చెలీ? యారసాలమావి యున్న యంకున్న గున్న పొదల వెదజల్లు పూలగుత్తులు, హారిణంబులు మాటి మాటికి దుముకుచు దట్టంబులగు పుష్పములతో, నెక్కు ళ్ళరీతి కొత్తళ్ళులతో, హారిణికై వడిహరిణివగిది జుఱుముఱుచూపులంజూచుచు, యాసంపెంగవాసనకుబ్బు చుయలరారెడు, పూబోడులకై వలసటవలసటదిరుగుచు విటకాండ్రక్రీడార్థంబుఁదెల్పు పుష్పచామరంబులవలె వెలుంగుయాపూగుత్తులు, యందలిమకరందము దొలగిం చవలెనని రాయుంచకాడు, మాటునడాగి బాణములు వే యుచుండ, యిదేదిరోవచ్చెఁడిపులియని, చందనతరువు క్రింద, జపముజేయుమునీశ్వర్లఁజూచి, జెవులునిక్కబెట్టు కొని యెట్లుఁజూచుచుండెనో యాకురంగంబులు.

వకుళ—అమ్మా! ఆమందారతరువుక్రిందచూడుము. ఏమి యాసోయగంబు? ఈవన సోయగంబెంత వర్ణనాతీతమై నది. (వెనుకకు తిరిగి) చెలి? రూపవతియు, భీముండిటే వచ్చుచున్నాఁడు.

(భీముఁడు రూపవతి ప్రవేశించి శిలావేదికపైఁగూర్చుండి)

భీమ—రూపవతీ! నీఋణము వేయిజన్మములకైన దీర్చుకొనలేను.

రూప—మహారాజా! కష్టమనకష్టమా? నాయవస్థ దేవునకు దెలుసు ఆనాఁడు మీరు సెలవిచ్చినది మొదలు పలుకష్టములకులోనైతి.

భీము—నీమేలు మఱువఁజాలను.

రూప—అటులనా? మీకొఱకు వేచియున్న రూపవతి. (ఇచ్ఛినీ దగ్గఱకుఁబోయి) తల్లీ! రాజాధిరాజని పేరొందిన వీరాధివీరుండ కడుగో? వానినే నీవు దాసునిగా జేసుకొన్నది. అమ్మా! ఆభీమదేవుఁడు వచ్చి నీకరుణాకటాక్షలేశమును బొందవేచియున్నాఁడు. పూర్ణచంద్రబింబమువలె, నీసుందరవదనము నావరించియున్న మేల్ముసుఁగు నెక్కించుక యెత్తించుకొనిన కడగంటిచూపులచే, నీతనికి బానమాడించి, కృతార్థునిగా జేయుము. ఈ రాజకుల మా క్షత్రియకులములో నుత్తమమగు చాళుక్యవంశము. ఇతని రాజ్యమా యనంతమైనది. పరాక్రమా శత్రురాజుల గడగడలాడించఁజాలినది. సకలసంపదలకు నిధియగు నితనివరించుట కేలసంశయించెదవు. ఈ రాజకుమారుని ఘూర్జరరాజ్యలక్ష్మితోఁ గూడ వశునిగాఁ జేసుకొమ్ము!

భీము—(తనలో) మంచిమాటవైచినది.

ఇచ్ఛి—(కోపముతో రూపవతిని తన్నును)

రూప—బాజె! యీకుమారితల్లిని నీవే వశపఱచుకొమ్ము! నాచేతఁగాదు. మరియొకసారి నడిగిన చచ్చేవఱకుతన్నును.

రూప — నాభాగ్యము మండినట్టేయున్నది. మోహాంధుఁడవై యున్న నీకీమెపాదతలము పుష్పముకంటె మృదువుగా నున్నట్లు తోఁపవచ్చును. కాని నాకది వజ్రముకంటె కొంచెము గట్టిగానేయున్నది.

భీము — (ముందుకు నడచి) ఓ జగన్మోహనాకారి!

సీ॥ ఈనాతిఛాయతో నెనగాక గాఁబోలు
శరభముల్ గుహలలో బరగుటెల్ల
నీబాలనడకతో నెనగాకగాఁబోలు
భద్రేభములడవిఁ బాఱుటెల్ల
నీచెలిచూడ్కితో నెనగాకగాఁబోలు
హరిణముల్ పొదలలో మరగుటెల్ల
నీనారి ఘనవేణి నెనగాకగాఁబోలు
ఫణులు పుట్టలుజొచ్చి బరగుటెల్ల
తే॥ నీనెలత జేరికాఁబోలు వించువింటి
శూలితనయుఁడయ్యు జగము జూచుటెల్ల
నిలలనస్సృష్టిఁజేసెగాఁ బోలుధాత
దీనిరూపున కచ్చెరువ్ గనగనేను॥

యువతీ! నీమృదు పాదములతో నీదీనురాలినిగాక, నన్నే తన్నినచో, నెంత యానందింతునో కదా? ఎంత కృతార్థుఁడ నాదునుగదా? నిన్ను మోసపుచ్చి తెచ్చుటచే కృతాపరాధుఁడ నగు, నాగుండెల పైదన్నుము. నీబాహుపాశములచే బంధింపుము. పాపమేమియు నెరుఁగని రూపవతినేల దన్నితివి. చిర కాలమునుండియు నీసౌందర్యమును వినుచు, సుందరహాసము

చూడలేకఁ బోవుటచే, మొడతెగని తాపముచే కాలము గడుపుచుండఁ, నీయస్త్రవిద్యానైపుణ్యముఁ దెల్పు, బాణము నాకంటఁబడినది. అప్పటినుంచియు నామనస్సునీయందు వ్రేళ్లాడుచున్నది. పవిత్రమగు బరమార వంశముఁబొడమి సౌందర్యమునకు, సద్గుణములకు నిధానమై ప్రాయమునకుఁ జిన్నదానవయ్యు నీబాణవిద్య నావంటి మహావీరుని మెప్పించినది. కావున నీయందు నాకెంత గౌరవమో, యెట్టియనురాగము మొలకలెత్తవలయునో చెప్పవలయునా?

సీ॥ కలికి; నీవాల్జూపు కల్హారములగప్పి
లలన; నీకరపల్లవములను బోదవి
చెలువ; నీనెమ్మోము శ్రీసంపెనలయుంచి
రమణి. నీమేనున రంగుజల్లి
నారి? నీబాహు మృణాళంబులను జేర్చి
సఖి! నీజడ సౌరు చందమమర
నెలతరో! హరినీల మణులబోలు యందమౌ
కురులిల గుదురుగా గూడియుండ

తే॥ చాన? నీరాగ్ర్యలిమలయు గావ కొప్ప,
సఖియ; నీపలపిందు శ్రీ చంద్రిసాటి,
సరసమూడుచు నీవు నాసరసనిలచు
భాగ్యమింక నెన్నఁడో గదా భాగ్యరాసి

ఇచ్చి—రాజా! నాకు నీయందనురాగము గల్గినను గలుగవచ్చును. మానవకోటి స్వభావము కాదనువారెవరు, కాని మాతండ్రి నీకీయనని స్పష్టముగా జెప్పెను. నాకు

2వ వాడు—అయ్యా! ఈదొంగ కొండగుహలో నుండెను.

3వ వాడు—పారిపోబోయేవానిలాగున్నాడు. వాడంజని తీసికొనివచ్చాము. ఏలినవారి యిష్టము.

చైతు—(లేచి) ఓహో? అభయసింహుడా? అభయసింహా, నీకీరూపమేమి? నీకిట్టియాపద యెట్లు సంభవించెను. ఇచ్ఛాసేన కుమారి యెక్కడ? నీవామెకేమైన నపకారము జేయ దలచితివా?

అభ—మహాప్రభూ? నాతప్పులు మన్నింపుడు. నే జేసిన దోషమేమియు లేదు. ఇచ్ఛానిపద్ద చనువుగ వర్తించుచు నన్ను రూపవతితో స్నేహముచేసి, యామెను వాంఛించుచు నాగిమూగల్గినన్ను చేయుమంటిని. యామెకిష్టమాలు నా ధనమంతయాలాగి, తుదకు నన్ను 'యచలేశ్వరాలయమునకుంబోవనున్న రాజకుమార్తెకు సాయమురమ్మని' వేడ నే నందుల కంగీకరించితి, రాజకుమార్తె స్వామిదర్శనార్థమై వెళ్ళినది. స్వామినిదర్శించి, తిరుగుమార్గమున, నక్కడొక బైరాగియుండెనని రూపవతిని దీసుకొనిపోయెను. అక్కడ నేమిజరిగెనో నాకుదెలియదు. రూపవతి నన్నును దీసుకొని పోయెను. ఆబైరాగి నాకొక వనమాలిక యిచ్చెదననియు చెప్పి, రూపవతిని పోవచ్చునని చెప్పి, నన్నొక పర్వత శిఖరముమీదకుం దీసికొనిపోయి, యొక చోటుంగూర్చుండబెట్టి "ఇప్పుడేవచ్చెదనని" చెప్పిపోయి మరికొంతసేపటికి పదుగురు మనుష్యులువచ్చి నన్ను పట్టుకొని బంధించి యొక కొండగృహాలో వైచి యాభై

రాగి నన్నుఁజూచి, "ఓయీ? నీవిట్లేయుంచుము, నిన్ను వదలినచో, నీవాయోగడమునకుఁబోయి, నల్వురతోఁ జెప్పి, రాకుమారిని దీసికొనిపోకుండ యాటంకముగా వింతువు. చావసిద్ధముగనున్న వీరునన్నుఁ దీసికొనివచ్చిరి.

జైతు——నీవు స్వస్థుఁడైనపిమ్మట, నిచ్ఛినీజాడలరయుము.

(అభయసింహుడు నలుగురు నిష్క్రమింతురు)

జైతు——హా! కూతురా? నీ కెంతయిక్కట్టులు సంభవించినవి. ఆ దుర్మాత్ముండగు భీమునిమీదనే నాకనుమానము. ముక్కు పచ్చలారని పసిబాలికను దొంగిలించుకొనిబోయిన, నరకముగాక స్వర్గమా!

శా॥ భూజాస్వారరాశితోద్ధతిబలాబోశాహ, భీముఁ డిలన్
దేశాంత్యావ్రిసియుతాట్టహాసవిసర ధీర్ఘామయూఖాళి, యా
హాసాంద్రయుతమైన సైన్యములతో హాకారముల్ సెంచనీ,
నీఛా; కృష్ణమహీజుఁడై వదరు యా తుచ్ఛున్ సెగూల్చెద్ధనన్॥

(తెరలో కలకలము)

జైతు——ఏమియా? కలకలము.

(నలుగురుమనుష్యులు యోణకనిఁ దీసికొనివచ్చెదరు)

1వ——మహాప్రభూ దండాలు దండాల్లు ఈశ్వరయ్యగారా యనగారిని మీదగ్గఱ యుంచమనిరి.

జైతు——ఓయీ? మీదేవ్వారు ఎవ్వనిబంటువు.

ఈశ్వర——(ప్రవేశించి) మహారాజ సమస్కారము.

జైతు——గురువర్యా? నీవా శీరం బలంకరింపుము. ఇతఁ డెవ్వఁడు.

ఈశ్వర — రాజా! ఇతఁడొక శతృకోటిలోనివాఁడు మన ఇచ్ఛినీదొంగల వాతఁబడినతరువాత, నేను నాయాగ్రామములందిరుగుచు మధుమంతమునకుఁ జేరితిని. అక్కడ నెంతమాత్రము యిచ్ఛినీజాడలుఁ దెలియలేదు. అక్కడ నుండిబయలుదేరి దండకారణ్యప్రాంతములలోఁ దరుగుచుంటిని ఇతఁడు వీనిభార్యచేసిన సంభాషణవల్ల నాకనుమానముకలిగి వీని వెంబడించితి. నామిత్రుని సాయమున వీని బంధించి, కావలసిన యుత్తరములు వీనిదగ్గఱ యుండుటచే వాటినిఁ గైకొని, మధుమంతమునకుఁ జేరితిని. రాజా! యీహారమెవ్వరిదో చూడుము (యిచ్చును)

జైతు — (పుచ్చుకొని) ఇయ్యది, ఇచ్ఛినిదికాదా? ఎట్లువచ్చె కడువింతగాయున్నది ఎచ్చటదొరకెను.

ఈశ్వర — మధుమంతమునకాగి, యచ్చట మారువేషమున యావూరునంతయు గుమ్మరుచు, తుదకు రాజమందిరమునకేగి, యచ్చట ఇచ్ఛినికి ప్రియమగు శ్లోకముచదివితి. అంతయామె బైటకువచ్చి, నాకిది నానవాలుగా యిచ్చెను: ఆమె కడుదీనవదనయై యుండెను. మనము త్వరగా యుద్ధసన్నాహము జేయవలయును.

జైత — ఇచ్ఛినీ; నేనెంత కఠినుండ,

సీ॥ మంచిగుణములతో మసలు వనితయా నా
పుత్రినిఁ గావరే పూజ్యులారా?
శమదమాన్వితసత్వ శాంతస్వభావతే
కామరిని నోమరే బాలకులార?

జననముదాదిగా సర్వేశ్వరుసఁ గొల్చు
సుదతిని బోఁవరే శూరులార?
బాణజాలములోను ప్రతిఘటింపని సాధు
కూతురక్షింపరే కొండలార?.
తే॥ నీతిలో విదవతి నిత్య సత్యవతియు
యిచ్ఛని గావరె? భూలోకయిందులార?
చంద్రుతో సాటిరాలును సాకరయ్యా!
కన్య పసిబాలికను మీరు గరుణఁ బోవ
(నిష్క్రమించెదరు.)
(అవనిక పడును.)

---

4 వ రంగము
(ఇచ్ఛానీ వకుళయు ప్రవేశించెదరు)
ఇచ్ఛాని—సఖియ; నేఁడు మనము కైలాసగిరి ప్రాంతముల కేగుదమా? యందలి వేడుక నరయవచ్చు.
వకుళ—ఏమి వేడుకల జూచుటకు?
ఇచ్ఛా—మాతండ్రిగారు చతురంగబలములతో వచ్చియున్నాడు.
వకుళ—అంతదూర మేల? ఇదిగో; యీవైపున జూడుము. ఆసైన్యమే యీబూగడసైన్యము.
ఇచ్ఛా—చూచి— ఆ. ఆ... చూచితి. ఎక్కనే చప్పుఁడు.
వకుళ—(తిరిగిచూచి) భీముండిటే వచ్చుచుండెను,
భీముఁడు—(ప్రవేశించి) ఆహా! యీసుకుమారి, యీమురి పెఁపుల వయ్యారి, నాయారవ ప్రాణముగదా, యీనె డియ అందం బన్నయందమా! నారాణి కాఁదా!

సీ॥ బంగరుగుబ్బలఁ బక్కకునొత్తినా
ముద్దుచెల్లించెడి యాదకత్తె
మునుపంటినాటిఁంచి నన్ను నాలించినా
తమకంబుఁదీర్చెడి తలిరుబోణి
వలపురానిచ్చి వగలఁదేలించియును నా
కోర్కెలుదీర్చెడి కోమలాంగి
చిఱునవ్వుకులుకయు చంగున లేచినా
వగలమరపెడిదీ వగపులాడి

తే॥ మక్కువనొసంగి మనసు నొక్కసంగి
గారవించు గొమ్మయయా బంగారుబొమ్మ
కమలభవుని విద్యలకును కమ్మతావి
కెన్నటికిఁ జేరునావంత లెపుడుదీరు॥

ఓహా! మీరలేదియో చేయుచున్నారు?
వకుళ — మహారాజా? మేముచేయునదేమున్నది.
భీము — మీరుఁజేయుటకు బనులులేవా? పోనిమ్ము; ఆ బూగడసైన్యములకు ఘూర్జరసైన్యముల బలాబల మరయుచుంటిరా?
వకు — అబలలమగు మాకు సైన్యములఁజూచునంతటి ధైర్యము లేదు.
భీము — నీకు లేకఁబోయిన బోవచ్చును, గాని యిచ్చినీకి మాత్రము యిటువంటిసైన్యము లెక్కయా? బాల? నీతండ్రిసైన్యములఁ జూచుటకు వచ్చితివా?
ఇచ్ఛి — ఊఁ

భీము—నీయందమునకు రంభ సాటివచ్చునే? త్రిలోక మోహనాకారివి.

ఇచ్ఛ—నాయందమేమియుఁ బొగడనవసరమేమియు లేదు.

భీము—ఇందలి పొగడుట యేమున్నది నాసామ్రాజ్యవైభవమును నొక్కకంటితోఁ జూచి, రెండవకంటితో నీతండ్రి రాజ్యముఁ జూడుము వనితా!

సీ॥ భీకర వేది పేర్లక్షణ లక్షితం
బరగుచుండెడివియనా భద్రజాతి
బాండ్య కేకయ చోళ బాంచాల్యాదితములౌ
కోటులు శ్రీవృక్షకీ ఘోటకములు
ముల్లోకమున పదు నాల్గుజాతులమీరు
బద్మినీవంశ సౌభాగ్యవతులు
గడువిదితములైన గంగణాగోమేది
గాంచనాదితవస్తు కల్మిమిగలిగి

తే॥ సర్వకాలములందును సన్నుతిలిచ్చు
రాజులను చూడుమా సఖి రయమునన్ను
గోరి, సుఖముల బొందుమా కోమలాంగి
నన్ను మించువాఁడుగలడె నళ్యకొమ్మ॥

ఇచ్ఛ—ఎంతయున్ననేమి, బుద్ధి చాతుర్యము గావలయుగాని తక్కిన వాటితో నేమిప్రయోజనము;

చ॥ బలములు సూపుయిట్టునటు బల్కితిభీముడ నే? గురోత్తము
ల్వలుక నెగాని బుద్ధియును బర్వదు నిన్నుఁగడుర్విపాలుగా
వలసి యిటాడుచుంటివిల బలోన్నతు జన్మపౌరుషంబు, ని
ర్మలనవగాంతి గాంచు ననుమాతోఁగాని నిల్వుము చూడదవన్ని యుఁ.

భీము——బోటీ? ఏటీమాటలు

చ॥ మదనదవాలఁ బొందుచు నెదం దపియించుచు నిత్రియుం
దవెరుగనేను గుందుచును నేఁడిదె వచ్చితి దేవి కావరా?
చదలిననంటి నీదుపై చన్నులకైవడి నాదుచిత్తముం
బదపదయింతయేల: యిఁక రాతివి వైతివి నీవు నాతిరో॥

అబలా, యిప్పటి సుఖంబుఁ బొఁగొట్టుకొని యెన్నఁడో రానున్న సుఖంబుల గోరెద వేల?

ఇచ్ఛి——నీముద్దును చెల్లించుటకు నేనవత్తెను,

భీము——నీవా? నన్ను నేలు నాభాగ్యదేవతవు (దగ్గరకుబోవును)

ఇచ్ఛి——ఓరీ వాచాట దూరముగానుండుము.

చ॥ అమితపరాక్రమోర్జితుఁడ నంచుగర్వము మానవేమొ, వ
వ్యమదధురంధుఁడై వెలుగ వారిజలోచన పృథ్వీక్షితిలో
యమపురి జేర్చు నేకులు మహాబలులు ప్రభువార్ద్రగారవా?
యమపురిఁజేర్తు నిక్కువము భీముఁడ నింక ధరాతలంబునన్॥

భీము——కాంతా? అంతయేల; నేజెప్పుదానికి సమాధానము జెప్పుము.

సీ॥ నీరజారాతిని గోరగలేదె, చందే
వబుధులపాలిటి వజ్రపాణి

ఇచ్ఛి——నీరజారాతిని గోరియేకద, యాతా
పసిచేత మహిభంగ బాటునొందె

భీము——గురుభార్యతో శశి గూడగలేదె? యా
శీతాంశుఁడేమయ్యె చంద్రవదన

ఇచ్ఛి——గురుభార్యతో శశి గూడుటచేగాదె?
మేనగళంకము గానలేదె?

భీము—సీతను రావణుం డెత్తుకొని జనగా
నాతని కేమి కొరంత జెందె;

ఇచ్ఛి—సీతను రావణుం డెత్తుకొని జనుట
చేగదా రాముని చేతఁ జిక్కె.

భీము—తే॥ తాపసుల నెంతవారిల తలిరుబోండ్ల
గాంచినంతనె మోహమున్ గలియ లేదె

ఇచ్ఛి—అదియె? తాపసులకుగదా యాతపోమ
హిమలు కుంటగలిపెడి విధములు రాజ.

భీము—బలిమినిఁ గలిసిన నేమి చేసెదవు.

ఇచ్ఛి—నన్ను గలియుటకు నలు మోముల దేవునికైన దర మా? ఎందుకు చెడిపోయెదవు, రాజ్యభ్రష్టత యేగాక, ప్రాణహానికూడ సంభవించును. ముందు రాబోవు కష్టముల జూచుకొమ్ము. నేను త్రికరణశుద్ధిగా జెప్పుమాటల నాలకింపుము.

ఉ॥ ఏను నిజంబుగా నృపు పయిఁ మదియుంచిన దాననేని నా
పైనియు పృథ్వీరాజునను బత్నిగ జేకొనుమాట తథ్యమా
నేని, యిలాతలంబునను నీదుకళత్రయుతంబుగాను మి
త్రానుజు దుంపలేన; మహి దక్షిణ దిక్తటమున్ బోగోరెదఁ

భీము—వనితా? ఏటికీ ప్రతిజ్ఞలు. పృథ్వీరాజుసంగతి నాకు దెలియదా? ఆమహారాజు పరాక్రమమెట్టిదో దెల్పెద?
(నవ్వి హేళనతో)

ఉ॥ పృథ్వీకిరాజుతానె బలవంతుఁడు నాతో విరోధమున్ గల్గం
గాతఁడు వాని తండ్రి నిలనంతకు జెంతకుఁ బంపగాను, మొ
క్కింతయు జేయలేక బరగాతఁడు, నిన్నును నేలుటేటి యో
యింతిరో! నన్ను బొందుమిక జింతలులేకను యుండుమా సఖీ.

ఇచ్ఛ—హా? నాకు దిక్కెవరు. ఓదీనరక్షా? ఆపదోద్ధారకా?

పీలు—రూపకము.

పృథ్వీనాథ సమోహనా శ్వేతవాహనా ॥పల్ల॥

1. ఎన్ని విధంబుల నిన్నీయెడ సన్నుతింతును
పన్నగశయన నీకు సేమని విన్నవింతును ॥పృ॥
అరయ నామీద దయయుంచి భారము బాపవె
యరమర లేకింక నాపై గరుణ జూపవే ॥పృ॥

భీము—ఏదేవుని వేడిన లాభమేమి? (నవ్వి) నాకన్న దిక్కెవరు, సచ్చరితా? ఉన్నదానిని బోగొట్టుకొనిన లాభమేమి? నామాటవిని నన్ను నేలుకొంటివేని నాయనంత రాజ్యమంతటికి పట్టపురాణిగ జేసెద. నేనొకటి కోరెద దీర్చెదవా?

ఇచ్ఛ—మంచిపనియైన చేసెద?

భీము—యువతీ? ఏమియులేదు. నీబాణవిద్య జూడవలయునని కోర్కె జనించినది.

ఇచ్ఛ—బాణవిద్యయందు నీకన్న నేర్పరి ననియా?

భీము—నేర్పరివనియె?

ఇచ్ఛ—నాదగ్గఱ బాణములు లేవు.

భీము—బాణములకేమి? ఇవిగో బాణములు. (బాణములు యిచ్చును.) కన్నులారా; నీ బాణవిద్య గాంచు భాగ్యము గాంచగలిగితిని. దేవుడు నిన్ను నాకు గూర్చినందులకు యా పుండరీకాక్షుడు వందనీయుడు.

ఇచ్ఛి—(బాణముతీసుకొని) ఓరోరి. ఇప్పుడు జేరిలిన బలుకులెప్పుడు బలుకకుము. నా బాణప్రయోగ మహాత్మ్యము వలనన్న నీమనసుకుదురు పరచుకొని నన్నుంపుము. ఇదిగో బాణముసంధించితిని (బాణమువిడచును)

(తెరలోఢంమనిధ్వని)

భీమ—ఆహా! ఎంతలోయాకోటకెక్కుము గొట్టితివి. నేటికి చాలు. బ్రతికినబలుసాకుతిని బ్రతుకవచ్చును.

(అవనికవాలును)

---

5 వ రంగము

(కైలాసగిరియందు మంజరి. సుఘోష, యిద్దరుప్రవేశించెదరు)

మంజు—చెలీ; భీమరాజెంతగట్టివాఁడే?

సుఘో—గట్టివాఁడని నీవనుకొనుము. వెఱ్ఱివాఁడు.

మంజు—వెఱ్ఱివాడైతే యిచ్ఛినిని నేలదెచ్చును.

సుఘో—తెచ్చుటవరకె సుఖించెనా?

మంజు—సుఖంచలేదా? మొన్న భీముడీ మందిరంబున, ఇచ్ఛినీతోసరసంబు లాడుచుండలేదా?

సుఘో—నీకంత బాగుగా దెలసినది.

మంజు—అదికాదె? భీముడునవ్వుచు యామెనుబట్టబోయెను.

సుఘో—స్త్రీయుద్దేశ మెట్లాయుంది.

మంజు—యుద్దేశమేమియులేదు. ఆమెయొడంబడలేదు. ఈయాయనగారేమొ యామెపెండ్లాడ గంకణము గట్టినాఁడు.

ము గాన్పించుచుండెను. చూచితివా? (బాణము ముందర పడును) ఆహా! వీఁడెవఁడో విల్లునమ్ములదాల్చినాఁడు. వింటబాణము సంధించినాఁడు. నన్నే గురిచూచి గొట్టుటకు బ్రయత్నముఁ జేయుచున్నాఁడు. ఏమిజరుగునో యిక్కడనుండియే కనుగొనెదను. (మఱియొక బాణముకు చీటిని కట్టి ముందరపడును) ఆహా! ఇదేమివింత. ఇది వాడియైన బాణము. ఇదిదగిలినచో బ్రమాదము తప్పక వాటిల్లును. లక్ష్యశుద్ధిగలవాఁడు, విలువిద్యయందు నేర్పుగలవాఁడు, దూరస్థమగువస్తువులనుగూడ వేయగలవాఁడు, ఈబాణమును యింతదగ్గరగా వేసినాఁడు, ఇయ్యది చూడ పూర్వకాలంబున, భారతయుద్ధమందు, భీష్మ యర్జునుల కుశలవార్తలుదెల్పు బాణమైయుండనోపు. దీనియందేదియో చీటిని గట్టియున్నది. (తీసి వకుళకు యిచ్చును.)

వకుళ — (చదువు చదువుచు) కన్యామణీ, నీకు సంభవించిన దుఃఖమునకు మేరయే లేదు. అందులో నీవు గానరామిచే నీతండ్రి తీరని దుఃఖములో మునిగియుండెను ఆనాఁడు బిచ్చగాని వేషమునవచ్చి, నీవిచ్చినహారము నీతండ్రికిఁజూపి కొంత శాంతింపఁజేసితిని. భీమదేవుండిక్కడకు రాకమునుపే వచ్చి, నిన్ను గొంపోవలయునని తలచితిమికాని వీలు కాదయ్యె? మేమిచ్చటను వచ్చినప్పటినుండియు, నీదర్శనముచేసి, మావృత్తాంతము నీకుఁ దెల్పవలయునని, యెంతయో ప్రయత్నముఁ జేసితిమి కాని విఫలమయ్యెను. మేమిప్పుడు కోటయందుఁ బ్రవేశించుటకు వీలులేదు.

అందులకు నేనైన నొక యుపాయముకొఱకు యీాపర్యంత మును తిరుగుచున్నాటిని. భీముని జయించుటకు విలులేనిస్థితి లోనుంటిమి. గాన బుద్ధిశాలివిగాన, యోగ్యమైన నొక యుపాయమును వెదకి, చెప్పవచ్చెదగాన, నాకు జాబుము ద్వార పంపవలయును.

ఇట్లు,

ఈశ్వరభట్టు.

ఇచ్ఛి—ఆహా? ఈశ్వరభట్టు విశారదత్వము, సమయసూత్రికి మాకుటుంబముకంటె నున్న ప్రేమ. నేను నిచెప్పెదను.



# ఇచ్ఛినీకుమారి.

## పంచమాంకము.

### 1వ రంగము.

(ఢిల్లీలో పృథ్వీరాజు కొల్వుదీర్చుట.)

పృథ్వీ—(విచారమున) నాపినతండ్రి యన్యాయముగ ప్రతాపాదుల జంపిననాటినుండియు నామనస్సునకుఁ జెందుచున్న మనోవేదనకు మేరయే లేదు.

తే॥ క్రొత్తకీడుగుచేసియు కొలదిగాక
శాశ్వత కళంకంబూనెను చలువరేఁడు
నటులనే ప్రతాపాదుల నరయజంపి
మాటబోదు యీభువియందు మచ్చవోలె?

అయినను గతించినదానికి వగచినలాభమేమి? ఇఁక గరుణరాజును నిందించినను సంహరించినను లాభములేదు. చచ్చిన ప్రతాపాదులు బ్రతికిరారు. వారిని జంపించితినని నెడి యపవాద మెప్పటికిబోదు. నాచిరకాలమునుండియు యా భీమునితోటి వైరము పొసగునాయని సమయముకొరకు వేచియుంటిని. కాని సమయము దొరకలేదయ్యె? (ఆలోచించి) నాజనకుని జంపిన పగను దీర్చుకొనుటకై సమయము దొరకదయ్యె. దుండగీడగు యాదుష్టుండెప్పుడు నాకరవాలమున కెరయనో యని గంపెడాసతో యుంటిని.

బంటోత్రు—మహారాజా నమస్కారములు—ద్వారపాలకుండొ
కండు తమ దర్శనార్థము వేచియున్నాడు.

పృథ్వి—తీసుకొనిరమ్ము? (బంటోత్రు నమస్కరించి ద్వారపాలకుని వెంటబెట్టుకొని ప్రవేశించి నిష్క్రమించును.)

ద్వారపాలకుడు—మహారాజా జైత్రపరమారుడు మీకొక జాబు నిమ్మనెను. ఇదుగో? (ఇచ్చును.)

పృథ్వి—ఏది? (అందిపుచ్చుకొని) మంత్రిచదువుము (ఇచ్చును.)

మంత్రి—మహాప్రసాదము (తీసుకొని!)

రాజేంద్రా; నేను మిమ్మును విధిప్రకారం బెండ్లాడకపోయినను చిరకాలమునుండి మీ సద్గుణములవినుచు మీ పాదసేవచేయుటకె నాహృది తలపోయుచు మీ రూపమునే నా హృదయమునందునిలిపి పూజించి మిమ్మును 'నా ప్రాణప్రియా' యనెడి పవిత్రాక్షరములతో బిలుచుట కనుజ్ఞయిందు. నేనుత్తమమగు పరమారువంశమున బొడమితిని అందులో నన్నివిధముల వన్నెగాంచిన బరమారు కుమారికను. మీయొక్క గుణశీలములవిని నామనస్సు యిదివరకె యర్పించితి. మనమున వరించినపురుషుండు భర్తయగుట సంశయము లేదు. యిట్లుండ ఘూర్జరదేశంబేలు భీముడు నన్ను జెరగొనియెను. మాతండ్రి సైన్యసమేతుడై మధుమంతమునకువచ్చి భీముని నెదిరింపలేక యూరకుండెను. వారొకవేళ తెగించి పోరిన యమమరణమే. పరాక్రమకవంశాలివగునీవు నన్నువిడిపించుట ధర్మము. త్రికర్ణములలో మనస్సె ప్రధానము. మీరు నాకు భర్తవెయుచుకొన్నచో బరగృహితనగు నన్ను విడిపించవల

యును. మీరు నన్ను పరించక పోయినను రక్షించ తగిన దానను. ఒక రాజకుమారిక యన్యగృహవాసియై యున్నప్పుడు పీరవంతులు యీ యబలను, చెరనుండి విడిపించుట రాజనీతి లక్షణము. పాలవంటివంశమున జనించినాను. హిందూయువతిని, మీవంటిధర్మజ్ఞులు నాకష్టములు తొలగించి సనాతన ధర్మము స్థాపింప కంకణముగట్టుకొని శత్రువులమును మూడి నన్ను రక్షింపుము.

ఇట్లు.

మీదాసురాలు.

ఇచ్ఛినీకుమారి.

పృథ్వి—(గోషముతో) ఏమి? అన్నా; ఎంతటిదారుణ కృత్యముల యొనర్చుచుండెను. దారుణమగువార్త? కట కటా; ఎట్టియికట్టులకు లోనైతివె నాప్రాణసఖి. జగదేక వీరుండని యెంచుకొను కాంబాలు. హా ఇచ్ఛినీ యెంతకష్టముల గల్పించితి. ముందాడనై యూరకుంటినే?

సీ॥ నాప్రాణ లలితాంగి నాజీవధామము

నావలపుల చెలి నాదుకాంత

నాభాగధేయము నాపైడిహారము

నాముత్యములదండ నాదుప్రేమ

నాపంచప్రాణము నాపాలిటి కలికి

నామేను సఖియనగా నాదుకొమ్మ

నాబంగరుకలికి నారతనాలకొ

మ్మ; పలుకులయువతి మరలజూడ

తే. భాగ్యములవేటి, పత్నిని బంధుజనుల
కాహ్లాదములిచ్చు యిచ్చిని గాయనోప
గాళ్ళు, చేతులువిరిగిన కట్టెబోలె
యున్న వాడ మహిని యందు నేను నేడు.

(ఆలోచించి) మంత్రిహితసామంతులారా? ఆకన్యామణిం రక్షించుట యుక్తమము. అదియుగాక హిందూయువతిని, యన్యమతావలంబికుడు చెరబెట్టుటయు, నేనూరకుండుటయు యామెనన్ను వరించగా, యానీచుండెత్తుకొనిపోయెను. అది రాజనీతికి విరుద్ధము. నాతండ్రినిజంపిన యీ క్షత్రియుని నేను దీర్చుకొనవచ్చును. యుద్ధసన్నాహం బొనర్పుడు.

(అవనికపడును.)

---

2వ రంగము.

(ఘూర్జరదేశములో జైతపరమారుడు పృథ్వీరాజు ప్రవేశించుట.)

జైత—రాజేంద్ర? నీవు సైన్యసమేతుండవై, మాకు దోడువచ్చినందుకెంతయో సంతసించుచుంటిని. ఇంక భీమునివలన మాకెట్టి భయములేదు.

పృథ్వీ—రాజా? భీముని సైన్యములు సామాన్యములుగావు. మనముముందుగా యుద్ధమునకేగడగినచో నెన్ని దినములు బట్టునో? ఈలోపుగ మనమారాకుమారిని విడుదలజేయవలయును. ఆమె మనచేజిక్కిన తరువాత నేమిచేసినను విచారముండదు. తగినయుపాయముదొరకినచో యామెను రక్షించుట యేముఖ్యము.

జైత — ఇప్పుడు జైతుడు కనుజాగరూకుఁడై మెలంగుచు, తగు ప్రయత్నములు చేయుచున్నాఁడు మనముముందుగ యుద్ధమునకుఁజొచ్చిన భీముఁడురాఁడు. అంతియేగాక దుర్గము లోనుండియే పోరుసల్ప నిశ్చయించినాఁడు.

పృథ్వి — ఇప్పుడు ఎంతసైన్యమున్నది.

జైత — ఎంతేయననేల, లక్షయాబదివేల సైన్యములు కంటికి నిద్దురలేకుండ పనిజేయుచుండిరి. భీముఁడు దుర్గాధిపతియైనాఁడు.

పృథ్వి — దుర్గాధిపతియా?

జైత — అంతియేగాక మనముదలపడి పోరుసల్పునంతవరకు, నాలమునకు రాడట. నిన్నటి రోజుననే, నహ్లాలపురంబుకు, నొకజాబువ్రాసి సైన్యముల దీసుకొని రావలయునని పంపినాఁడు.

పృథ్వి — కానిమ్ము' నేనుండ నేమియు భయములేదు.

జైత — తనదుర్గములోనికి నెవ్వరు రాకుండు నటుల రక్షకభటుల కాజ్ఞాపించెను,

పృథ్వి — దుర్గద్వారములు బంధించినాఁడు కాఁబోలు.

జైత — జయించుట కష్టము.

పృథ్వి — (రోషముతో) జయించుట కష్టమా? ఎంతమాటంటివి? నేనాభీముని వధించ లేకఁబోతినేని, సర్వరాజ్యములువిడచి కాననంబులలో మునివృత్తిఁబూనెద. అంతియేగాక, యీభరత ఖండంబున వన్నెకెక్కు, నేను యీ యధమాధముండగు భీముని చేతనా, ఓడుట? ఎంత

మాట? ఓకులద్రోహీ? నీకంకాళములు ఖేదించువరకు
నామనంబొప్పదు. అజ్మీరు రాజ్యముగెల్చి, చక్రవర్తినై
తుదకు యీనీచుని జయింపలేనా? ఛీ! జయించనిది
యింకెక్కడి బ్రతుకు. (తలయూచి) ఓభవానీ; రణరం
గంబున బురికొల్పి జయంబు సమకూర్పుము.

మ॥ క్షమియింపంగదవమ్మ మమ్ము దయతో జంద్రార్ధచూడామణీ
సమకూర్పంగదవమ్మ సంతసముతో సావిత్రి? మాడెందపుం
గమలంబుల్ వికసింప జూడగదవే కాత్యాయని రక్షించవే?
సమమెవ్వారు? యీదేవినీకు నిల విశ్వాదేవి దక్షాయణీ.

నిష్క్రమించును.

(అవనిక పడును.)

---

## ౩ వ రంగము,

(భీమునిమందిరంబున వకుళ, ఇచ్ఛినీకుమారి ప్రవేశించెదరు.)

ఇచ్ఛ—చెలీ! మనమీభీమదేవుని మందిరంబెన్నాళ్ళయుండ వలయును,

వకుళ—మనమీదుర్గమును దాటువరకూ నిచ్చటనే యుండ వలయును

ఇచ్ఛ—ఆహా! ఎప్పటికి విముక్తి యగునోకదా సకలరాజన్య చూడామణులలో వన్నెకెక్కి తుదకిట్లయితి. నాజీవితము వ్యర్థము. సకలసైన్యసమేతులైయొకమ్రోలనాజనకుండు, వేరొకమ్రోల చతురంగబల సమేతుడై, నాప్రాణ నాథుండొక మ్రోలవచ్చియు, యెడతెగని యీఘూర్జర

సైన్యఘాటి కాగలేక కాబోలు యూరకుండిరి. ఎప్పటికి విముక్తి కావలయునో నప్పటికే యగును.

భీము—(ప్రవేశించి) ఆహా? ఎంతప్రయత్నము చేయుచున్నారు. ఇచ్ఛానీ యింకవారికిదక్కదని తలచియు, వెంగలులై నాపురంబును ముట్టడించిరి. (నవ్వి) ఎవరిపిచ్చివారికానందము, ఎలుకలు పిల్లులతో చెలగాటనాడినట్లున్నది. నాతో యుద్ధము. నానాదేశపు రాజులెల్లరువచ్చిరి. ఏమివారి మతాభిమానము. ఢిల్లీచక్రవర్తియు వచ్చియున్నవాడు. రావటము మంచిదే! చక్రవర్తి ననెడిగర్వము తొలగించవలయును. ఎవ్వరొచ్చినను నన్నేమియుచేయలేరు.

(ఇచ్ఛానీవైపునడచి) వనితా; క్షేమముగానుంటివా?

ఇచ్ఛా—నీదయవలన క్షేమముగానే యుంటిని?

భీము—(తనలో) నామీాదదయవచ్చెను కాబోలు.

ఇచ్ఛా—తొందరపడకుము.

భీము—కాముకేళికితాళజాల? నీవేమందువు.

ఇచ్ఛా—ఛీ; మాట్లాడకుము.

భీము—బలత్కారము చేతనైన వరించెద? అదియుంగాక నాయఖండమైన సామ్రాజ్యమును జూడుము.

సీ॥ వనితనీపదపద్మ మునబోలనిచిగుళ్ల
పాళికేకిశ్రేణి పాలుజేసి
తెరవ? నీనవయవ సిరితోనుసాటిగా
నీదుజవ్వననిగ్న నెమ్మిజేసి

పద్మాస్య? నీమోవి బంటికో సరిరాని
పల్లవరుసంబక బాలు జేసి
కలికి? నీతావికిఁ గలసరిగానిక్రొం
పరిమళం బూనిక పాలు జేసి
తే॥ వనిత; నీనడకేసుల వనరుగాను
చిలుకపలుకు తెల్లను చిన్నెలాన
ముగనుజేయు; విశ్వంభర మునమునింపి
నేఁడు బానుజేసెద వేల నీలవేణి!

ఇచ్ఛ—ఆహా! పరమాత్మా! ఈదురాత్ముఁడెంత బలాత్కారంచుచుండెను.

పీలు - ఆట - చాపు

త్రినేత్రాత్రయరాణి త్రిభువనరాణి
పరమేశ్వరాణి పరమకల్యాణి ॥త్రి॥
అరమరక లేక శంకరి నమ్మినాను
దయయుంచి నన్నిక దరిజేర్చుమమ్మా ॥త్రి॥

నన్నంటిన నీవు సాహస్రపశు లవుదువు.

భీము—యువతీ? నేఁడు నిన్ను విడిపింప బలవంతులు వచ్చియున్నారు. నేఁడు తప్పక నిన్ను కలియుదును. నేమిచేయుదువో చెప్పుము.

మ॥ జలుక్కుంకుబ్బల గన్నులన్ మధుర భాషన్ కాంతియుక్ మోవియున్
లలితానందతరంగముల్ విమల సల్లాపంబులున్ కంకణం
బులు, మార్విభవంబు జూచియు బూవ్వూదోట్లనీబోటులిం
ధులగంటి? స్మరుతూపులంజిదుమనే, దూర్వాహుడన్ నైతెనిన్ ॥

ఇచ్ఛా— రాజా? ఇదినీకుఁదగదు. నీవు నరకమునకాహుతి యగుదువు.

భీము—కాంతా? నరకమా? నేనడుగుదానికి సమాధానము చెప్పుము.

ఆ॥ అతిదరిద్రుఁడెవఁడు?

ఇచ్ఛా— యతితృష్ణకలవాఁడె

భీము—యెవడు భాగ్యశాలి? యెవడుసంతోషి

ఇచ్ఛా—బ్రతికియుండి మృతుఁడౌ? యతనవిహీనుఁడే

భీము—మృతము కానిదేది?

ఇచ్ఛా— మతినిరాశ.

భీము—ఓహో? అత్యాశగలవాడెల్లప్పుడు దరిద్రుండనియు, యెల్లప్పుడు యున్నదానితో సంతోషించువాఁడు భాగ్యశాలియనియు, బ్రియత్నముచేసి, పాటుపడనివాఁడు బ్రతికియుండియు సచ్చినవానితో సమానమనియు, నాశదిగనాఁడినవాఁడు, యనగా వైరాగ్యముగలవాఁడు చిరకాలజీవియనియా? ఇంకొక్క ప్రశ్న.

గీ—మహాని నిద్రితుఁడెఁడు?

ఇచ్ఛా— సమాధినిష్టుఁ

భీము—డెవఁడు జాగ్రత్?

ఇచ్ఛా— సదసద్వివేకిసుమ్ము.

భీము—శత్రులెవరు?

ఇచ్ఛా— నిజేంద్రియచయమొజగము

భీము—మిత్రులెవరు?

ఇచ్ఛ— తజ్జతుల్ మేదినిపయి.

భీము—ఇంకొక్క ప్రశ్న?

ఆ— వారణంబు లేవికి లవు బ్రహ్మము జెంద.

ఇచ్ఛ— శాన్తిదాన్తి మరివిచారమరయ

భీము— వీతరాగు లెవరు?

ఇచ్ఛ— విడచియు జ్ఞానంబు

శివునితత్వ నిష్టచేయువారు?

భీము—బ్రహ్మము తెలుసుకొనుటకు సజ్జనసహవాసము న్ను, ఇంద్రియ నిగ్రహమును, వీతరాగులయినవారును, మోహము విడచిన వారును, బ్రహ్మతత్వనిష్టగలవారును, దెలిసినపండితులని యూ? నీభావము. స్త్రీలలోకి స్త్రీవైన ను నీవే?

చ॥ కనికని పక్కయుంటినను కౌగిటంజేర్చియు మోముజూపి యూర
చనమధువిచ్చి పాడిముఖ చంద్రునితో రస మొక్కపొన్నల
న్ననలోకచోట నీహితులోనర్చెడి మాటలనమ్మి మోమునుం
గనబడినీకదా బితివి కాంతరో? యెంతసుజాణరాలవే?॥

ఇచ్ఛ—ఏమి? నీచపలబుద్ధి?

భీము—కాంతా? నీవెంత గగ్గోలుపడి యేడ్చినను, నాకన్న దిక్కెవ్వరు? మారుపలుకక నన్ను వరించుము. డిల్లీశ్వరుండు నిన్ను విడపించునేమోయని తలచుచుంటివి కాబోలు. ప్రమదగణసమేతుండైన శంకరునకలవియగునే?

ఇచ్ఛ—నీవంటి దుర్మార్గుల రక్షించుటకు రాక యేమిచేయు దురు? పాపి, నీరాక్షసకృత్యములు నానాటికి హెచ్చుగు చున్నవి. చాళుక్యవంశసంభవుండవు, క్షత్రియుండవీవాన

ర్పితీవని, తోటిరాజులు యానందింతురుగాక. త్రేతాయుగమునందువలె, కలియుగమందుగూడ, యొక స్త్రీ జనకంటకుండుండెనని ప్రఖ్యాతిగాంచుము.

భీము—నేను స్త్రీజనకంటకుండనా?

ఇచ్ఛి—స్త్రీలను బాధించుటచే, కంటకుండవే?

భీము—నేను బాధించుటలేదు?

ఇచ్ఛి—నన్ను సుఖపెట్టుచుంటివా?

భీము—నీవు సుఖపడుటకు సమస్తమిచ్చితి నాలోపమేమి?

ఇచ్ఛి—మనస్సు స్వస్థతలేనప్పుడు దుఃఖకరములే? మనస్సు కారణముగాని తక్కినవిగావు?

భీము—నీవు మనస్సునేల బదిలపరచుకొనరాదు.

ఇచ్ఛి—ఇచ్చటనుండ నాకది యసాధ్యము.

భీము—ఎక్కడ సాధ్యమవును?

ఇచ్ఛి—నాతండ్రిగృహమున.

భీము—నేను నిన్ను బాధింపను. మరియొకతడవ నీయస్త్ర విద్యాప్రదర్శనముగావించి నాకానందముగావింపుము.

ఇచ్ఛి—నీవు నాకనందముగల్గింపనపుడు నేనేల గల్గింపవలయును.

భీము—నీవట్లు చేయువరకు నేనిచ్చటనేయుండెద?

ఇచ్ఛి—రాజా? అస్త్రవిద్య పురుషులది. పురుషులొనర్పు పని చేయునప్పుడు నట్టివేషముండవలయును. నాకట్టిదుస్తుల నర్పింపుము.

భీము—నీవేమో స్త్రీ గాని త్రెక్కి చెప్పిన దర్శనీయుఁడవుగా యుందువు.

ఇచ్ఛ—అగునుగాక, నేనీవేషముతో వింటిని దాల్చెదను.

భీము—నీయిష్టము (వస్త్రములుయిచ్చును)

ఇచ్ఛ—(గస్తులు ధరించుకొని బాణము దాల్చును.)

భీము— యువతీ—? నీవు పురుషవేషము దాల్చినను నీరూపము కడుసుందరముగానే యున్నది.

ఇచ్ఛ—(బాణము సంధించును,) (లోకులక్షించుచున్నను.)

అవనిక పడును.

(భీముఁడు రూపవతి కూర్చుండెదరు.)

భీము—రూపవతీ? జయించుటకష్టమని యే తోచుచున్నది. వేలకొలది హిందూరాజులు, ఘూర్జరరాజ్యమును నాశనము చేయవలయునని వచ్చిరి! (తెరలో)

రాజా నీవిక్రముల బేలవయ్యెదవు?

శా॥ విశ్వరాజ్యమెంచ నీయునికి యిచ్చానుఖంబాయువున్
శాశ్వతాజగమంత నీకరముఁదాగేశ్వరుతో సాటిగా
విశ్వద్దేవుఁడవై మెలంగుచును నీవిద్ధారుణీ వాసియుగ్
యైశ్వర్యంబునుగాంచి నీకుదగునే విశ్వంబు జింతింపగ

ఉ॥ వీరులు నీదుమంత్రికులు శూరులు భూపరి పాలరాజులున్
నారయ మృత్యువైన నిను దేరియుఁజూడ భయంబునొందనీ
పేరనినం దలంకుదురు వీరపుబల్కుల, కంటినీరు ని
ద్ధారుణిఁ బెట్టనేలయిఁక వారిని గీటడగించుమా సఖా

భీము—ఎవ్వరిదీ వాక్యము?

(తెరలో బిగ్గరగా)

రక్షకభటులారా? తలుపుదీయుడు. ఒకయుపాయమువల్ల మోచుకొనివచ్చితిని. దానిని రాజుగారికి దెలుపవలయును, మీరింతమాత్రమాలస్యము చేయకూడదు.

(తెరలో) నీవెవడవు?

(తెరలో) సందేశహారుడను.

(తెరలో) ఎక్కడనుండిరాక?

(తెరలో) మధుమంత్రునుంచి

(తెరలో) అతడు పరమారుని కారాగార గృహమునయున్నాడే?

(తెరలో) అవును. మాయోపాయంబుచేత తప్పించుకొనెను,

బంట్రో—(ప్రవేశించి) మహారాజా మధుమంతుడు పంపెనట. తమదర్శనార్థముచేయ గోరుచున్నాడు.

భీము—తీసుకొనిరమ్ము? (సేవకుడు నిష్క్రమించును.)

సందేశహారుడు—(ప్రవేశించి) మహాప్రభో? దండాలు, దండాలు.

భీము—ఓయీ? నీరాకనీయుస్థలపురంబునుండియా? మధుమంతుడు పంపెనా.

సందేశా—అయ్యా? నన్ను మధుమంతుడు పంపెను. అతడు కొనప్రాణములతో యున్నాడు. యొకజాబు యిచ్చినాడు. అతనిభార్యయున్నదట. అవసానకాలమునవచ్చి కంటబడి తన్నానందింప వేడుచుండెను.

మాప—(కెవ్వునకేకవేసి) హా, నాథ, హా యీశ్వర,

భీము — రూపవతీ, ఏమి యుభయము లేదు, అతఁడు స్వస్థుఁడగు
ను. ఓయీ? యీవృత్తాంతము చదువుము.

సందేశా — (ఉత్తరము చేతఁబట్టుకొని) మహారాజా!
దేవరవారి పూర్ణానుగ్రహంబునకుఁ బాత్రులగు సేవకులలో
నొక్కఁడనగు, నేను ప్రభుభక్తి నెల్లడింప లేకపోయితినందులకు
విచారించుచున్నాను. ఇచ్ఛసిద్ధికుమారిని సాధించుటలో కొం
చెముగా జేసితిని. అనుగ్రహించుడు మీకిమ్మనిన యుత్తరము
శత్రువులచేజిక్కి కొనెను. గతించినదానికి వగచిన లాభమేమి
యీసందేశాహరుఁడు నాకు బరమమిత్రుఁడు. ఇతనిసాయ
మున నేను కారాగృహమునుండి బైటపడితిని. సదా రోగ
పీడితుండనగు నాకు నడవశక్తి లేదు. మిమ్ము దర్శింపలేను.
మధుమంతమునకే రాదలచితిని, శత్రుభయముచే రాజాలక
పోయితిని. ఇదే నమస్కారములు. తక్షణ నాప్రియురాలిని
పంపించకోరెదను, ఇంకొక్కమనవి. ఈపురుషుడు జైత్రపుర
మాయని శత్రువు. ఇతనికి యోధభటునిసాయముగా బంపిన
బంధించి తీసుకొని రాగలఁడు. ఆరాజునుగూడ చెరనుంచిన
చో, తండ్రిదుఃఖమునరయ లేక మిమ్మును వరించును. ఈమె
వారి బారిపడకుండ యోకవీరుని సాయము పంపవేడెద.

ఇట్లు విన్నవించు
మీపాదసేవకుఁడు
మధుమంతుఁడు.

భీము — ఈతని ప్రభుభక్తి? ప్రాణముబోవనున్నను, నాక్షేమ
మునే నరయుచుండెను. రూపవతీ దుఃఖము మానుము.

ఈ రాత్రియే బోయి హాతనిస్స్వస్థత జేయుము. సేవకా? భూయాదుని తిసికొనిరమ్ము?

భూయా—రాజా? నమస్కారములు.

భీము—భూయాదా? నీవు నితనితో సాహసతిని, మధుమంతమునకు జేర్చవలయును. అటుతరువాత మీరిద్దరు పరమూరుని బంధింపవలయును.

భూయా—చిత్తము. (నిష్క్రమించెదరు)

(అవనిక పడును)

---

3వ రంగము,

(మధుమంతమున యొక కొండమీాద, చెట్టుకు రూపవతిని త్రాళ్లతో గట్టివేయుదురు, ప్రజలు గుమిగూడుదురు.)

1వ—యేరోయి? యెంకా? రారా పోదాము కొండకు.

2వ—యేంటన్నా? చలి యేత్తుల్లా?

3వ—చలి యేంటన్నా! పానముమీాదకువత్తేను.

4వ—కొండకు యేంటిరా యిందరుపోతున్నారు?

1వ—యేరా? బావ, యెవ్వరో, ఆడమనిషి యేడుపు వినబడుత్తాది.

3వ—అదేందో చూదాం, పదరా?

(తెరచుట్టివచ్చి

1వ—అమ్మయో; దేవుడా, యెంత దూరమున్నదిరా?

2వ—ఓలబ్బో? నేనడవలేను.

3వ—పదండిరా పదండి,

4వ—ఏమిటిరా, యిట్లామనుష్యులు మూగారు?

3వ—ఏదిరా, ఏది?

2వ—అదుగో, కుడ్డీఖానా.

(తెరయెత్తివచ్చెదరు రూపవతిముందర తెరయెత్తబడును)

1వ—(తొంగిచూచి) అమ్మయో? ఇంకేమున్నది.

3వ—ఏంటిరా? ఏమొచ్చింది పోగాలము.

4వ—నాకుజూస్తే భయమేతుంది.

2వ—ఆమ్మో; నేనురాను దెయ్యమయ్యినదో?

4వ—మనల పట్టుకోదుగదా? అమ్మో! నాను మొక్కుతాను.

3వ—పానంయుందేమో చూడరా?

1వ—నేచూతా (దగ్గరకు వెళ్ళిచూచును) పానంయుందిరోయి బతికీయుంది రాండసా రాజుగారికిత్తాము.

(రూపవతిని తీసుకొనిపోవుదురు) తెరబడును)

(భీముడు రూపవతి ప్రవేశించెదరు)

భీము—రూపవతి? నీకిట్టి యాపదకల్గించినవాడెవండు నిన్ను బాధించిన క్రూరులెవరు పూలవంటి శరీరముగల్గిన నీవంటి దానిని బాధించినవాడెవండు. ఈ నీలపురంబునకుం బోయెడిదానవు నీవీచెట్టునకేల బంధింపబడితివి. నీకురక్షకుండుగావచ్చిన భూయామడేమయ్యెను.

రూప—ఓమహారాజా? ఏమిదెల్పుదును ఎవ్వరికర్మవారిని వెంబడించును. పూర్వకర్మనుతప్పించ నెవ్వరికి తప్పౌను నాకురదృష్టదేవత నాతోయుండెను.

భీము—అట్లయిన నీకీయుపకారము చేసినవారెవ్వరు.

రూప—దుర్గద్వారముదాటునంతలో నన్నిలపురంబునకుఁగొని
పోవవలసిన వస్తువులింటనే మరచితి. వారితో నావస్తువుల
దెచ్చుకొందునని చెప్పి, నేను వెనుకకుఁబోతిని నేనుతిరిగి
వచ్చునంతలో వారు దుర్గముదాటిరి ద్వారపాలకులు
వారిని నడ్డగింపలేదు. నేను రక్షకభటులనడుగ ద్వార
మావతల వేచియుండిరని చెప్పిరి. నేను ద్వారముదాట
గానే సందేశార్థుడు నన్నురమ్మనిపిలచెను. పదిబారలు
బోవుసరికొక పురుషుండు దారసిల్లెను అతఁడొక స్నేహి
తుండని చెప్పెను. రాత్రిసమయమున మరియొకరిసాహ
య్యము మంచిదని యెంచితిని కొంతసేపటికి మారుదారిఁ
బోవ మొదలుపెట్టిరి. నేనదేమని యడిగితి అది దగ్గరదారి
యని చెప్పెను. అంత కొత్తగావచ్చినపురుషుఁడు నన్ను
నడుమిరగదన్న మొదలుపెట్టెను నేనంబోయని యడల
సాగితిని వారందరేకమై నన్నాచెట్టుకుఁ గట్టిరి. అతఁడెవ
డో మోసగాఁడు వలెయున్నాఁడు భూయామఁ డేయయిన
యూరకుండునా? ఇదియంతయు నాలోచింప పరమారుని
భటులు మారువేషములతో వచ్చి మనల మోసపుచ్చి
నారు మనము యిచ్ఛినీని మోసపుచ్చినట్టు వారు మనల
మోసపుచ్చినారు మనముఇచ్ఛినీనిపువ్వులతోఁ బూజించి
తిమి? వారుమనలజెట్టుకుఁగట్టిబూజించిరి ఇదివ్యత్యాసము.

భీమ—ఎంతయవమానము జరిగెను ఓరీ, సేవకా?

సేవ—(ప్రవేశించును) మహాప్రభూ? ఏమిసెలవు.

భీమ—నిన్నరాత్రి మనపురంబునుండి యెందరువెళ్లినారు,

సేవ—ముగ్గురు కాదు, కాదు నలుగురు.

భీము—వారెవ్వరో తెలియునా?

సేవ.—సందేశాస్త్రుడు, రూపవతి, భూసురాదుడు నాల్గవవా
డని వారి యనుచ రుడు.

భీము—ఇ కెవ్వరైన వచ్చినారా? లేదా

సేవ—(భయముతో) మహారాజా? సందేశాస్త్రుడు దప్ప
మరెవ్వరు రాలేదు. రాత్రి నాల్గవయామమున, వారిని
బోనీమని నిర్బంధించితిమి? భూయ్యాదునను చనుండనుట
చేత, మీరంగీకరించిరనుటచేత, విడచితిని ఆముప్పురు
ముందుగాబోయిన తరువాత రూపవతి బోయెను.

భీము—(రూపవతిని జూచి) యువతీ! నాల్గవవానిం జూచితివా?

రూప—లేదు చూడలేదు.

భీము—నీవు మార్గమధ్యమున నెవ్వరోకలసుకొనినియుంటివే?

రూప—అతడు భూసురుడేయయిన చో, సుమంగుగా నన్నే
ందన్నును.

భీము—అట్లయిన నీయభిప్రాయమేమి?

రూప—వారుముగ్గురు శత్రువులే? రాజా? ఇచ్చినని దెచ్చి
నందులకు ఫలమిది? మీకేల యామెను బలాత్కరించ
గూడదు. నామెనీకు లొంగదు నీవామెను పెండ్లికూతురు
లాగున మేపుచుంటివి నాల్గుదినములు బాధించిన వరిం
చును (నిష్క్రమించును)

భీము—(ఆలోచించి) నేడు ఇచ్చినకుమారిని తప్పక బల
త్కారించవలయును. ఆయుధములు యుండుటమంచిది

(ఆయుధములుతీసుకొని మందిరంబు వెదకుచు) ఏమిది? నా భాగధేయమింతుగానరాదేమి? ఈదుర్గమునుజొరబడిశత్రువులు తీసుకొనిపోయిరనుట కల్ల. ఎక్కడికి బోయియుందురు? అదియుంగాక వకుళయుంగూడలేదే? వారిద్దరుకలసి నెక్కడయిన దాగియుండిరేమో? (యొకవైపుజూచి) ఈ మందిరంబున దీనస్వరమొకటి గానవచ్చుచున్నది. ఏమైయుండును చూచెద (తలుపుతాళము వేసి) భూయాద, ఏమిది, ఇచ్ఛని వకుళయుండవలయు నేమైరి? నీవిందేల యుంటివి. అన్హిలపురంబునకుం బోవలేదా?

భూయాదుడు—(బయటికివచ్చి) మహారాజా? రాత్రిరెండవ యామమున నేను బయలుదేరుసరికి, వకుళవచ్చి, యొక వస్తువు నిచ్చెదనని, యిక్కడకు తీసుకొనివచ్చి, బిగము వైచి వారిద్దరెక్కడకో పారిపోయిరి. దైవవశమున మీరు రావడముచేత, బయటబడితిని.

భీము—(కూలబడి) హా దైవమా? ఎంతపనిచేసితివి. నాప్రియసఖికి నాకు నెడబంధము జేసితివి. అయ్యో? ఇచ్ఛనీకుమారిపోయినది. నాజీవితముపోయినది. నారాజ్యలక్ష్మి పోయినది. నామనోహరాంగిపోయినది. నాకికజీవనమేల? ఈదాసదాసీ జనమేల; ఛీ: నాకీతుచ్ఛపు దేహమేల; (క్రోధముతో) ఓహో సైన్యాధిపతులారా లెండు లెండు. రణభేరి మ్రోగింపుడు. యుద్ధమున గడంగుడు, ఇచ్ఛనీకుమారి పారిపోయినది. శత్రువులు కోటలో ప్రవేశించిమోసపుచ్చిరి. ఇదేయాజ్ఞ. (ఆవసిక పడును.)

4వ రంగము.

(కోటను ముట్టడించి యుద్ధముచేయుదురు.)

భీము—(రోషముతో ప్రవేశించి) ఓ వీరభటులారా? మీ రాజునకు సాహాయ్యము చేయవలసిన సమయ మిదియే! ఇంతకంటె మరొక సమయములేదు. అతి ప్రయత్నము మీద సంపాదించుకొనిన, నారత్నరాజమును, పరమారుషును, పృథ్వీరాజును, నాస్వస్థానమునుండి కదిలించినారు. మహమ్మద్ గోరిని తరిమి పౌరుషంబు నేడు వెలిబుచ్చండి. ఇదే నాయాజ్ఞ.

(నిష్క్రమించును.)

పృథ్వి—(రోషముతో ప్రవేశించి) ఓ మహా సైన్యములారా? ఓ అతతాయి వీరాధివీరులారా! మీమీ పౌరుషంబుల వెల్లడించి, భూలోక కంటకుండగు భీముని పీచమడంచి, పేరడంచండి. ఇదేనాయాజ్ఞ.

(నిష్క్రమించును.)

(తెర.)

ఓ భీమరాజా!

చ॥ సెనగకు మేమిలాభమిల వీరుఁడ వేయగు జైత్రభూతుకుం
గొనుట రహిత్వ్రాక్రమము కొంచెముతగ్గకబోదు, సంతమీ
దినమున దేలగాగలదు తేజము యుంచుము వాటనిమ్మలే
మునజొరనిమ్ము, తొందరపడబోకుము జైత్రకుమారిసన్నిధిన్

(భీముడు అమరసింహాదివీరులు ఖడ్గధారులై ప్రవేశించెదరు)

భీము—(మండిపడుచు) ఓ వీరాధివీరా, నీవిట్లేల యుపేక్షించెదవు.

ఉ॥ నీదగు నేత్రముల్ యునికి నెంతయు వీరుడ? సత్యధర్మసం
పాదనజూచునారరె; వందలనొంచరె, పెల్లుమార్చరే
నంతయుమిం పోకదగునంతయు ఇచ్ఛినిఁజూడలేదె, నే
నిందునిరర్థకబల మంతయుఁ జూపితి నేఁడు నేనిలన్

వీరు:— గునగును. నాకుగన్నులు లేవు. కొండికడొకఁడు ద్రంమందె, మొనజొచ్చెనని, సేనాధిపులుండ, మాకన్ను లెందుకు, మాశౌర్యమెందుకు. అమరసింహుఁడు లేడా?

భీము:— (మరింతమ జీపముచు) గురువర్యా? ఇచ్ఛినీకుమారి సైన్యంబంతయు నల్లకల్లోలము చేయుచుండ, నామెను డీకొనువారు, మనసైన్యములో లేరయిరి. నేనభయ సింహునితో దలపడి పోరుసల్పుతరి, రెండవవైపున, ఇచ్ఛిని భేదించుచుండెను. మీపరాక్రమంబులఁ బుద్ధి కొల్పుడు.

వీరు:—(రోషముతో) ఓ జైనవీరులారా?

ఉ॥ మానవజన్మమెత్తినను, మంచికులంబు జనించియుండినన్
మానుషముండినన్ తివిరి మంత్రము నేర్చిన గొందరిందు వి
ల్లూనుట నేర్పితిన్ శరము లుండినవీరులరైన నోర్వగా
బూనుఁడు ధర్మమున్ నడపి బుద్ధిచెడెండిక యిచ్ఛినినికన్॥

(సింహనాధముచేయుచు నిష్క్రమించెదరు,)

(తెరలో) ఓ భీమరాజా?

ఉ॥ ఈ మొనమాకసాధ్యమని యెంచిరచించితి, వీరజుండుమా
కీమొన, యొక్కగుప్పెడగు నేయనితో చెడి రీతివచ్చె మీ
మోములఁ యుందు హిందువుల మాకలజేయగ నెంచగారహిన్
గాములకేళిగాదదిగో; కాచుకొనుండిదె వచ్చె బాణమున్॥

అభయ:—(ప్రవేశించి) ఘూర్జరవీరులారా? ఆగుఁడాగుఁడు,

ఉ॥ పారిన నేమిలాభ మిటు పాపముసేయుటఁ బారిపోకకున్
జేరుచ హిందువుల్ మిముల జీల్చియు చీల్చియు రెండు జొచ్చినన్
మారణ జేయు పాటిరణ మానిసులింత వెరగారరే; శత్రున్
ఘూర్జరయోధులన్ దుదిగ గుచ్చియు నెత్తరె, విల్లు మార్చరే॥

పృథ్వి—(ఆతురతతో ప్రవేశించి) అల్లదె, మొదటు ప్రక్కమున ముల యుద్ధమారంభమైనది. ఇచ్ఛినీకుమారికకు డెప్పరమగుచున్నది. సత్వరమునబొమ్ము!

అభ—(సింహనాదముచేయుచు నిష్క్రమించును.)

పృథ్వి—(విచారముతో) అకటా!

ఉ॥ కష్టమటంచు వెంబడిన గాచెదనంచును బాసజేసినా
యిష్టమ, ఘూర్జరాధిపుల యిక్కటు గర్వము, భీమదుస్తరా
రాష్ట్రభటాళి వైరయము రమ్మని బాలిక సాగనంపగా
కష్టము కాదొకో? యిటుల, గాంచగ లేకయుబోతి ధూళిలోన్॥

నేనెంత విముఖుఁడనైనను, గణింపక యీవ్యూహ మోహారంబున యిచ్ఛినీకుమారిక డీకొనెను. పోనీ, నేనుసారథినై వెంటవచ్చెదనన్న నొప్పుకొనెనా? ఆహా? జైతుని పోరితాన్హము, అభయునిబీరము, యీశ్వరభట్టు వాగ్దానము, (తెర వంకజూచి) ఈశ్వరభట్టు నాయకత్వము విందొనరించుచుండెను. ఈ మొగ్గరంబులో జొరబడి పోవుచున్నాడు.

(పోపోవుచు) భీమరాజా?

ఈశ్వ—(ప్రవేశించి) పృథ్వీరాజా? అల్లదేజూడుము. కోసలాధికుఁడభయునిమీద లఘించుచున్నాడు. వానిని లెక్కజేయక యే, మనయభయసింహుఁడు గదయుచున్నాఁడు.

పృథ్వి—ఇప్పటికిఁగదా? కొంచెము మనశ్శాంతి. వేకువనుండియు బోరాడుచుండినను కొంచెమైన చెక్కుచెదర డీకొనుచుండిరి.

ఈశ్వ—అమరసింహునిచూడుము. అంబరంబున కేగి మన సైన్యంబులమీదకుఁ గవయుచున్నాఁడు.

పృథ్వి—ఇచ్ఛినీకుమారిక మాత్రము సామాన్యురాలుగాదు. ఇంతవరకు నామెను డీకొనువారు లేరయిరి.

ఈశ్వ—అభయసింహుఁడిప్పుడే, సైన్యములో నికిదుమికి, ఇచ్ఛినీకుమారికను సమీపించుచున్నాఁడు. అరరే? రాకసివలె భీముఁడు నభయుని డీకొనెను.

పృథ్వి—జైతపట్టిక రక్షణయెట్లు?

ఈశ్వ—జైతపట్టి శరజాలంబుల నెట్లు గప్పుచుండెను. శత్రులు యామెను యొక్కతడవ గుమిగూడినను, లెక్కసేయక, వారిని నురుమాడెను. (ఆశ్చర్యముతో)అయ్యో? తప్పెను కాని యీపాటికి యమసన్నిధానమున నుండెడిదియే? అభయసింహుఁడు చిక్కుపడి యున్నవాఁడు. అపాయము రమ్మురమ్ము;

(యిద్దరు నిష్క్రమించెదరు.)

భీము—విచారముతో ప్రవేశించును.

తే॥ నమ్మినాఁడను బంధుజనంబులెల్ల
నాకుదోడయి పోరుదురనియు నేను
యుద్ధమునకు డీకొనినాఁడ యుర్వినందు
కాని జైతపట్టి నదల్చ గానరాకొక్కె.

---

ఈయూహంబునకెల్లనిమేటి శిశిరాత్రి, శిరాధిపతుల నుక్క-డించుచుండ, యెక్కడివారలక్కడనే, నిలచి పోవుచుండిరి. అకటా! తుట్టతుదకు నాకుదాని చేతిలో చావవలసి యుండెను కాఁబోలు. ఇచ్ఛిసికుమారిని గూల్చినగాని జయంబు సమకూడదు. కోసలాధిపుండు మాత్రము హాహా హోరిగఁ బోరాడుచున్నవాఁడు. అతఁడుకూడ మూవాత వెన్నిచ్చినా జెప్పనక్కర లేదు. అదిగో వచ్చుచున్నాఁడు, ఇచ్ఛిసికుమారిని నోడించితివా?

కోసలా—(ప్రవేశించి) ఎక్కడజయము, యింకెక్కడజయము.

తే॥ శంబరుని గూలగను జేసె, శక్తిచేత
వాని కేను తోడుగ జన వంగకయును
రథము నాయించి రథ్యసారథుల నొంచి
నను దొలంగించె యిచ్ఛిసి నందమూల.

ప్రాణములతో బయటపడితిని.

భీము—కోసలాధిపా! నీకు కష్టమయ్యెనా?

కోస—ఆహా!

అమర—(ప్రవేశించి) భీమరాజ! నాయంతవాని నొక్క-యంబున దూలగొట్టెను.

భీము—ఏటికి?

అమర—శంబరభంగపాటు సహింపలేక, పైనెత్తితి. ఎత్తినంతనే వెనుకకుఁ దీసితిని. వాని రణచమత్కార మేమందును. చెప్పమరచితి. గురువు ... ... మూర్ఛిల్లె.

భీము—మూర్ఛిల్లెనా? (అందరు నిష్క్రమించెదరు.)

(భీముఁడు అమరసింహుని ప్రవేశించెదరు.)

అమర—భీమరాజ! వింటివా? ఇచ్ఛనీవృత్తాంతము.

భీము—ఇచ్ఛనీకుమారిని దెచ్చితిరా?

అమ—నిన్న యుద్ధము ముగిసినంతనే, గోకులదాసాయువాహ నోనర్చె.

భీము—ఒనర్చెన?

అమ—ఉదయముననే రాజత శిబిరమున కేగెనట. అచ్చట నెవ్వరులేకపోవుటచేత సంతోషించి, ఇచ్ఛనీ చిక్కెగదా యనిలోని కేగునంతలో నెక్కడనుండియో, యుద్దండభీముని లాగునవచ్చి, విసరివేసె. అంత గోకులదాసు రణభూమిలో పడెను.

వీరు—(ప్రవేశించి) రాజా? నేఁడీభండనంబు మస్తరముగా యున్నది. ఇచ్ఛనీకుమారి ధనుర్విద్య కనుశోచనీయము.

కోస—(రోషముతో ప్రవేశించి) ఏమేమి?

ఉ॥ జైతవ పక్షపాతమును జెందగ, గట్టిగబట్టియున్న మీ
రెంతయు సంగరంబునను రాకయు మూలలడాగియుండినన్
బంతము నేనుగెల్చుటయొ పారుటయో, పడిపోవుటో, యెటో!
కొంతగ రాజకార్యమునకున్ దగినట్లొనరింతు మీదటన్॥

భీము—సెబాస్, పౌరుషంబన, నట్లుండవలె, కోసలాధిపా; నీవు యమ్మేటి వీరవతియగు ఇచ్ఛనీకుమారిని జయించితివనెడి వార్త నెప్పుడు విందునో? నేఁడుజరిగిన పరాభవమింతయా?

కోస—గురువర్యా? మీరు తాకుదురనియనుకొంటిమా? బ్రాహ్మణవిశ్వాసము నేటికి తెల్లమయ్యెను. భీమరాజ; వీనితో

నీకేల; ప్రొద్దుటినుండియు కార్చిచ్చువలె దహించుచున్న జైత్రపట్టిని నోడించుటకు మాగురుగా, తాకజాలమని యెంత నిబ్బరముగాఁ జెప్ప సాహసించెను.

వీరు—నివామెబలము, రణచమత్కార మెఱుగవు.

కోస——అదే నీ మొనసితనము. (బిగ్గరగా) ఓజైత్రకుమారా?

ఉ॥ అల్లినరుంగుపావకని ధర్మముఁజేయుట మిన్నమోయనన్
కల్లరి భీమకుండునరి గాడనిసేమియొకేన్న కార్యమున్
చెల్లిన జెల్లెగాకికను జీల్చియు పేల్చియు మొగ్గరంబునన్
జెల్లవు కోసలాధుని, క సీన్ మసియాసటు మాయలిందునన్॥

(తెరలో) అవునవును. ఇదుగో వచ్చుచుంటిని. కాచుకొనుము. త్రుటికాలములోనె, నాబాణమున కాహుతి కాగలవు.

(భీముని సైన్యముమీఁద బాణములు పడును.)

ఇచ్ఛా——(రక్తబట్టలతో ప్రవేశించును.) ఓరీ, భీమాధమా? ఓరీకోసలాధిపా; ఏమని కారుకూతలఁ గూయుచుంటిరి.

(బాణము విడుచును)

ఉ॥ ఘూర్జరనాథునోలగము గోరినగాదిది, సంగరంబు, నీ
వైరము నాకు నేఁడిలను వైరివియైయ్యనుజాపురారి, ద
క్షకరవృథాగదెచ్చితిపి గావునహోయిఁగనుండునట్లు నీ
వైరముబూడ్దిపాలు, నృపవర్యుని జేయగనెంచె నేటితో॥

తే॥ బలముగలవారు భువిలోన బరగుచుండ
జూపురోరిమీఁదుబలమున్ సూక్ష్మముగను
ఇదే; వచ్చుచుండెనుదూత యింపులర
కాన, యమనాజ్ఞనిదిగోను కనుగొనుంతు

(రెండువైపులబాణములువిడచుకొని) ఇచ్ఛినీకుమారి
కోసలాధకుని తరుముకొని వెళ్లును)

భీము—అబ్బా; చచ్చువరకు చావగొట్టుచుండెను.

వీరు—కోసలాధికుండు మూర్ఛిల్లె—అపజయము.

(అవనికపడును)

---

5 వ రంగము

(యుద్ధభూమి)

భీము—(రక్తబట్టలతో బ్రవేశించి) ఓ వీరాధివీరులారా? రణంబున వెనుకకుదీయకుఁడు. శైతునివధించ నేఁడుదుస్తరమగు ప్రతిజ్ఞబూనుఁడు. (నిష్క్రమించును.)

పృధ్వీ—(నెత్తురుబట్టలతో బ్రవేశించి) ఓ హిందూసైన్యములారా? మీమీ బలంబులఁజూపి, శత్రులనోడించుఁడి. ద్వంద్వయుద్ధంబున గడగి ఇచ్ఛినికి సాహాయము పడుడు. (రెండవవైపుజూచి) నేను యీసైన్యంబున జొరబడవీలు కాదయ్యె. రణంబునస్త్రీయ మేటికి. సార్వభౌముండనై, యొక్కయబల, శత్రువులమధ్య సింహనాదముచేయుచుండ నూరకుండవలసివచ్చె. మరియొకదిశకేగి జొరబడెద, (నిష్క్రమించును.)

అమర—(ప్రవేశించి) ఆహా? ఎంత జీవహింసజరుగుచుండెను. ఎంతెంత ఘోరహత్యలు జరుగుచుండెను. ఒక్కరాజకన్యకొరకెంతరక్తముపారుచుండెను. ఓ జైతకుమారి, నిన్ను నిముసంబులో దొంగిలించి తెచ్చితిని కాని,

నేఁడు మాబీరములన్నియు వృథాయయ్యె. ఆహా! ఘూర్జరరాజ్యలక్ష్మి నేటికిఁ జెల్లును గాఁబోలు. (యొకవైపు చూచి) అదుగో? అభయసింహుండే వచ్చుచున్నాఁడు.

అభయ— నెత్తురుఁబట్టలతో రోషముగ బ్రవేశించును) ఓరీ; అమరసింహా? ఘూర్జరరాజ్యమంత్రి. ఎందుఁబోయెదవు. నిలునిలు.

సీ॥ ఆబూగిరియునందున్న యందలిపై నాగి
వేషము జనినాటి బాసనేఁడు
ఆబూగిరియునందున్న యందలికాషాయ
వస్త్రము జెలఁగేటి బాసనేఁడు
ఆబూగిరియునందున్న యందలిపీఠులు
యిచ్చి బంధించేటి బాసనేఁడు
ఆబూగిరియునందున్న యందలియిచ్చిన
మత్తువస్తువునాటి మాయనేఁడు

తే॥ మత్తుగొనినట్టి యిచ్చినీ నెత్తుకొనియు
యీపురంబున దింపిన యిట్టిశక్తి
నేఁడుజూపుర్లోరె, ఖలుఁడా; నిన్నుమరపు
రికిని బంపుటనిక్కము జేసినావు॥

తే॥ నాఁడు విడచినను నేఁడును విడువలేను
నీదుపాలిజముఁడు యిదోసికొరకెర
జేయఖడ్గమెత్తుచునుండె జాగునే
నీల్గనుంటివి రమ్మిక నేఁడునీవు॥

(అమరసింహుని పడగొట్టను యుద్ధమున)(నిష్క్రమించును.)

భీము—(రోషమునప్రవేశించి) ఓరోరి కులద్రోహి! చేతను బాణములు లేనప్పుడు మీదబడి చంపెదవా? హా? మంత్రి! నీవి కటికినేలమీదగాఢ నిద్రబోవుచుంటివా?

(తెర్ఁలో) అరే? భీమా? పారిపోకుము. నిన్నుకడ తేర్ప నిటే వచ్చుచుంటిని.

(తెరలోకలకలము) మహారాజా? ఇచ్ఛినీచే విడువంబడిన బాణముచే, చచ్చుచుంటిని. దానినదల్చువారెవ్వరులేరు,

భీము—హా. ఇంక దిక్కేది. జైతకుమారియెంత సాహసురాలు. ప్రాణరక్షణ. (నిష్క్రమించును.)

ఈశ్వ—(ప్రవేశించును) జైతపట్టి మంత్రి దారినే నడచుచుండెను.

(తెరలో) ఓ జైతవసైన్యాధిపా? నేఁడు ఘూర్జర భీమునిచే, జైతుని మేనల్లుండగు, అభయసింహుండు చచ్చెను.

ఈశ్వ—నాప్రియశిష్యుండు పరలోకమునకేగెను. ఇంకెక్కడిశిష్యుఁడు, (రోషమున) నాటివాగ్దానమంతయు వృథా యయ్యె. అరే! భీమా! నాకు యద్ధుపడుదువా! అబ్బా! భీమా! చచ్చితివా! నేఁకునిన్ను మట్టుపెట్టుటయో; లేక నడవిపాలు నట్లోచేయవలయును. ఇపుడేబోయి ఇచ్ఛినీకుమారికకు తోడ్పడవలయును.

జైతు—(ప్రవేశించి) గురువర్యా! పృథ్వీరాజు వృత్తాంతము వింటివా?

ఈశ్వ—జైతా? భీముండు గూలువరకు యీ యాశ్వరభోట్టును కదల్చకుము. పృథ్వీవర్తమానము, గిద్వీవర్తమాన

ము, చెప్పకుము. భీముఁడు చావవలె, యీశ్వరభట్టానం
దింపవలె. (నిష్క్రమించును)

చైత — ఎట్లు ఈసంగ్రామంబు పరిణమించునో;
(నిష్క్రమించును.)

భీము — (ప్రవేశించి) పిడుగువంటి అభయసింహుఁడు చచ్చుటచే కొంతజయంబు సమకూడునని నాసజాంచినది. ఆయిచ్ఛినీకుమారిని జయించినగాని, సంపూర్ణజయంబు బడయము. (రోషమున సైన్యముమీఁదకు లంఘించి) ఓరోరి, పిరికిపందలారా! మిమ్ముల జంపరాలేదు. పృథ్వీశుండెందున్నవాఁడో చెల్పుఁడు. ఓయతతాయి మొదలగుపిరికిపందలార, పారిబోకుఁడు (ఘూర్జర సైన్యము వైపుతిరిగి) ఓహో ఘూర్జరసైన్యములారా? ఉత్సాహముతో బోరుఁడు. జయంబుగాంచుడు. (తిరిగి)

సీ॥ ఓపాలయక్షయో రీయతతాయి, యో
రీ, ప్రకంపనక, యో రీనలండ
ఓరీవిరూపన యోధూమ్రమోచన
యోరీకళింగాధ యోరినకుల
ఓరీ, రణాంతక యోరిమదోన్మత్త
యోరోరికేకయ యోరికాల
ఓరిరక్తముఖుఁడా యోరిపాపాయు, యో
శతృభేధి, యోరీ శస్త్రహస్త
తే॥ పారిబోకుఁడు మీవంటి పిరికిబంట్ల
చెడ్డనెత్తురు కన్నులజూడలేను

చూడ నెంచిన రత్నముఁ జూపురోరి
ధనురు విద్యావతీ నబల ధన్యురాల్ని॥

పృథ్వి—(రక్తబట్టలతో ప్రవేశించును) ఓహో, సైన్యములారా? వెరవకుండు, నేనిదే వచ్చితి.

మ॥ భూలోకాధిపుఁ బందె పెట్టితి నికన్ సాధించి సాధించెదన్
బోలా భీమునిఁ దక్కు రాజన్యులన్ భూశ్రోణి రాద్రోద్ధతిన్
త్రిలోకంబుల నేను యేలెదనికన్ వాలంబునన్ నేయశ
శ్శ్రీలన్ నెక్కుడనిండ జేసెద ధరారోల్గంబునన్ మెచ్చగా॥

(భీముని మీద గమకి) ఓరీ, తుచ్ఛా; నిలునిలు;

భీము—(రోషముతో) చండాల; ఏమి;

ఉ॥ ఓరి దురాత్మ; సిగ్గువడియుండక నీదుల తాంగి నాతో నీ
వారిజ గయ్యముల్ గడకు బంపి జయంబును జెందదొంగవా
శ్రింత మేమితన్నాన? ధీవర శూరత నిల్వరా; యిలా
ధారుణి నిన్ను మన్నగొని దారను సంతసగొందు వ్రేల్మిడిన్॥

సిగ్గులేక రణంబునకు యెట్లువచ్చితివి. నేచేబట్టిన, కన్యకొరకింత ప్రయాసయేల? ప్రాణంబులఁ దక్కించుకోదలచిన యిచ్ఛనీ నెందున్నదో చూపి, నావలకు బొమ్ము.

పృథ్వి—ఏమి కండకావరపు మాటలు. నిన్ని పుడేమి చేయుదును.

మ॥ ఫాలాలంబున నేత్రసంజనిత తీవ్రకోపకామూర్తిన్
నీలో నెంచవురా పృథ్వీశునినను న్నీచాత్మ యేమందు యీ
బాలన్ దొంగిలివచ్చినట్టితిదే నీప్రాణంబులన్ దూల్చెదన్
వ్యాళోదగ్ర మహోక శాళములచే ప్రాణంబుగొంపోయెదన్॥

(అనియుద్ధముచేయును. భీముని సైనికులు పృథ్వీరాజునుముట్టడించెదరు ఇద్దరిని పడగొట్టి భీముని పట్టుకొన్ని) భీమా!

సీ॥ లచ్చివీక్షించిమో హించినందులకుసి
నేత్రయుగంబున నెక్కినొక్కి
తొయ్యలి, చెంగు చే తొలగినందులకుని
యురమున బెనుగద యుంచియుంచి
కాంతకౌగిలించం గలిగినందులకుని
కరముల బాణముల్ గ్రుచ్చిగ్రుచ్చి
చానను, దుర్భాష సలిపినందులకుసి
నాలుక ఖండలు నరకినరకి
తే॥ నన్యునిసతినభిలషించి నందులకును
తునితునియలుగాగోసియు తుదమొదలుగ
రహిని, యిసికించి, యిసికించి రమ్యమంబు
నిన్ను మృత్యువుకన్యయు నేలుగాక॥

(భీమునిసైనికులు పృధ్వీరాజుమీాద దుముకుదురు.
యుద్ధము సేయుదురు.)

ఇచ్ఛ——(రక్తబట్టలతో ప్రవేశించి) దుర్మార్గులారా! మిమ్మి పుడే యమసన్నిధానమునకంపెద. భీమా? నిలు, నిలు. పారిబోకుము. (యుద్ధముచేసి పడగొట్టును)

(తెరబడును.)

సంపూర్ణము.



# సాహితీ పత్రిక.

సంవత్సరము చందా రు 3-0-0 లు.

ఇది ఆంధ్రదేశములో 5 సంవత్సరములనుండి అవిచ్ఛిన్నముగా నడపబడుచున్న భాషావిషయిక మాసపత్రిక. ఈ పత్రికలో మంచిమంచి కథలు మనోజ్ఞమైన గీతములు ప్రకటింపబడుచుండును. ఆధునిక కవితాపద్ధతులు తెలుసుకొనవలెనన్న సాహితీ చదివితీరవలసిన పత్రిక. ఈపత్రిక ననేకసార్లు భారతి, జన్మభూమి, ఆంధ్రపత్రిక మొదలగు తెలుగుదేశ పత్రికారాజములు- వేనోళ్ల పొగడియున్నవి. తెలుగు దేశములోనున్న సుహృదయులెల్లరు యీపత్రికనుగూర్చి సదభిప్రాయములను వెల్లడించియున్నారు. ఈపత్రికల పాతసంచికలు సంవత్సరముల వరుసను సంపుటములుగా బైండుచేయబడి కొలది ప్రతులుమాత్రమే విక్రయమునకు సిద్ధముగానున్నవి.

1వ సంపుటము (3 సంచిక లేకలవు) చక్కని బైండు రు 0-12-0.

3వ సంపుటము చక్కని బైండు (6, 7 సంచికలులేవు) రు 2- 8-0.

4వ సంపుటము (చక్కని బైండు పూర్తిగావున్నది.) రు 3- 6-0.

కలయువారు:

మేనేజరు, శారదా భాండార ముద్రాశాల, బెజవాడ.

అని వ్రాయవలయును.

# తప్పొప్పుల పట్టిక

| పుట | తప్పు | ఒప్పు | పంక్తి |
|---|---|---|---|
| 14 | జయుంచె | జయించి | 16 |
| 15 | గిగి | గిరి | 15 |
| 20 | పృతా | పృథ్వి | 2 |
| 11 | కంశమర్ధన | కంసమర్ధన | 14 |
| 22 | చౌకీహాన | చౌహాన | 16 |
| 24 | సశిలుంప | సశియుంప | 9 |
| 25 | నవ్య | సవ్య | 8 |
| 26 | అని | అది | 14 |
| 38 | దావిని | దానిని | 12 |
| 40 | శాలియైన | శాలియయిన | 10 |
| 45 | నను | నిను | 4 |
| 47 | యేచాయకీ | యేచాయకే | 11 |
| 57 | బలుడుయో | బలుడుయా | 6 |
| 64 | మాయ | మాత | 4 |
| 67 | చీత | చీర | 12 |
| 72 | స్ఫారరాశి | స్ఫారకరాశి | 11 |
| 73 | కాగి | కేగి | 13 |
| 89 | విశ్వదేవి | విశ్వద్దేవి | 9 |
| 93 | వారణంబు | కారణంబు | 3 |
| 93 | ఆ | ఆగ | 3 |

| పుట | తప్పు | ఒప్పు | పం |
|---|---|---|---|
| 92 | గ | గీ॥ | 17 |
| 94 | కనందము | కానందము | 16 |
| 95 | దానేశ్వర | వాగీశ్వర | 16 |
| 102 | వేసి | తీసి | 7 |
| 16 | దురల | మరల | 6 |
| 106 | టిప్పించే | డిప్పించే | 8 |
| 104 | చక్ప్రర | చికాప్రర | 18 |
| 111 | జాగునే | జాగునేల | 21 |
| ,, | యిచ్చి | యిచ్చిల | 12 |
| 64 | కెదంతి | సుదంతి | 4 |
| 52 | సామ్త్రిఅల | సౌమిత్రిల | 11 |



